ఆంధ్రపితామహ

# మాడపాటి హనుమంతరావు







డి. రామలింగం

# ఆంధ్ర పితామహ

# మాడపాటి హనుమంతరావు

( జీవిత చరిత్ర )



రచన :

డి. రామలింగం

ప్రచురణ :

ఆంధ్ర పితామహ

మాడపాటి హనుమంతరావు శతజయంతి ఉత్సవ సంఘం

హైదరాబాదు

'Andhra Pitamaha Madapati Hanumantha Rao', A biography in Telugu by D. Ramalingam, published on the occasion of his Centenary year, 1985.

March, 1985 క్రోధన ఉగాది.





Published by M. L. Narasimha Rao for the Andhra Pitamaha Madapati Hanumantha Rao Centenary Celebrations Committee, C/o Sri Krishnadevaraya Andhra Bhasha Nilayam, Sultan Bazar, Hyderabad - 500 001; with the kind financial assistance given by the Department of Cultural Affairs, Government of Andhra Pradesh.



Price : Rs. 10

Cover design by Sri Goli Sivaram

Printed at
Ramesh Printers & Publishers, Chikkadpalli, Hyd-20.

# ప్రస్తావన

ఆధునికాంధ్ర నిర్మాతలలో అగ్రస్థానం అలంకరిస్తున్న మహనీయుడు, మహామనీషి ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు. పూర్వపు హైదరాబాద్ సంస్థానంలో నిజాం నిరంకుశాధికారం నిరాటంకంగా కొనసాగుతున్న రోజుల్లో తెలంగాణ ప్రజలను మేల్కొల్పి, వారిని చైతన్య వంతులనుచేసి, వారిలో మాతృభాషాభిమానాన్ని, జాతీయ భావాలను రేకెత్తించి, తెలుగు భాషాభివృద్ధికి, తెలుగు సంస్కృతి వికాసానికి, తెలుగువారి అభ్యున్నతికి అపార కృషిచేసిన త్యాగధనులలో, ప్రజాసేవా పరాయణులలో ప్రప్రథమంగా పేర్కొనదగిన వారు మాడపాటి హనుమంతరావుగారు. ఆధునికాంధ్ర చరిత్రలో వారికి గల స్థానం సమున్నతమైనది. తెలుగు సంస్కృతి పునరు జ్జీవనంలోనూ, నవ్యాంధ్ర వికాసంలోనూ వారు నిర్వహించిన పాత్ర బహు ముఖమైనది, బహుధా శ్లాఘనీయమైనది. తెలుగుదేశంలో గ్రంథాలయోద్య మానికి తలమానికమైన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం శ్రీ హను మంతరావుగారికి అత్యంత అభిమాన సంస్థ. ఈ సంస్థతో వారికి గల సాన్నిహిత్యం ప్రగాఢమైనది.

ఆంధ్ర పితామహ, పద్మభూషణ శ్రీ మాడపాటి వారి శతజయంతి ఉత్సవాలు యావదాంధ్రలో సముచితరీతిని నిర్వహించడానికి శ్రీకృష్ణదేవరా యాంధ్ర భాషానిలయ కార్యవర్గం నిర్ణయించి, భాషానిలయం అధ్యక్షులు శ్రీ అవ్వా సత్యనారాయణరావుగారి అధ్యక్షతన ఒక శతజయంతి ఉత్సవ సంఘం ఏర్పాటు చేయటం జరిగింది. హనుమంతరావు గారికి అభిమాన విషయాలపైన, వారు తమ జీవితంలో సాధించ దలచిన లక్ష్యాలకు సంబంధించిన అంశాలపైన చర్చాగోష్ఠులు, సభలు సమావేశాలు మొదలైన కార్యక్రమాలు జరపటంతోపాటు, వారి సంగ్రహ జీవిత చరిత్ర కూడా ప్రచురించవలెనని ఈ కమిటీ నిర్ణయించింది.

శతజయంతి ఉత్సవ సంఘం అభ్యర్థనపై ప్రముఖ రచయిత, సాహిత్య విమర్శకులు, శ్రీ డి. రామలింగం గారు ఈ కార్యభారాన్ని వహించి ఎంతో ప్రయాసపడి సమాచారం సేకరించి అత్యంత ఆసక్తిదాయకంగా, భావితరాల వారికి మార్గదర్శకం కాగల రీతిలో పంతులుగారి జీవిత చరిత్రకు అక్షర రూపం

కల్పించారు. శతజయంతి ఉత్సవ సంఘం పక్షాన వారికి నా హృదయపూర్వక అభివందనములు.

రాష్ట్ర ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ వారు ఈ గ్రంథ ప్రచురణకు దయతో ఆర్థిక సహాయం అందజేశారు. ఈ శాఖ వారికి, ముఖ్యంగా సాంస్కృతిక వ్యవహారాలు, సమాచార శాఖ కమీషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఎ. ఎస్. గారికి ఉత్సవ సంఘం పక్షాన నా మనః పూర్వక కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. ఈ కార్యక్రమం తలపెట్టినది మొదలు వారు చూపిన శ్రద్ధ, ఇచ్చిన చేయూత మేము ఎన్నటికీ మరువరానివి.

శ్రీ పంతులు గారితో అత్యంత సన్నిహితంగా పనిచేసిన సాహిత్యవేత్త, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు, భాషాభిమాని, సహృదయులు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ కమీషనర్ అయిన శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ గారు మా అభ్యర్థనను మన్నించి ఈ గ్రంథానికి వారి తొలిపలుకు, పరిచయ వాక్యాలు వ్రాసి ఇచ్చారు. వీరిరువురికి నా వందనాలు. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు గారి శతజయంతి సందర్భంగా ప్రచురిస్తున్న పంతులు గారి ఈ జీవిత చరిత్రను ఆంధ్రావని ఆదరించగలదని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథాన్ని అతిత్వరలో ముద్రించి ఇచ్చిన రమేష్ ప్రింటర్స్‌కు, ముఖచిత్రం వేసి ఇచ్చిన ప్రముఖ కళాకారులు శ్రీ గోలి శివరాం గారికి, ఈ కార్యక్రమంలో నాకెంతో తోడ్పడిన శతజయంతి ఉత్సవ సంఘం సభ్యులకు నా కృతజ్ఞతలు.

ఎం. ఎల్. నరసింహారావు

గౌరవ కార్యదర్శి,

ఆంధ్ర పితామహ

మాడపాటి హనుమంతరావు శతజయంతి

ఉత్సవ సంఘం.

హైదరాబాదు,

22-3-1985,

క్రోధన ఉగాది.

# మనవి

ఒకమారు నేను ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారిని 'ఆంధ్ర కుటీరము' లో దర్శించినప్పుడు "మీరు మీ ఆత్మకథ వ్రాయండి. ఆ గ్రంథం తరతరాల తెలుగు యువతీ యువకులకు ఉత్తేజం కలిగిస్తుంది" అన్నాను. అప్పుడు నేను 'గోలకొండ' దినపత్రికలో సహాయ సంపాదకుడిగా పనిచేస్తూ ఉండేవాణ్ణి. పోలీసు చర్య జరిగిన తర్వాత సంగతి ఇది. పంతులుగారు నా మాట శ్రద్ధగా విన్నారుగాని బదులు చెప్పలేదు. నేను వెంటనే "మహాత్ముడు కూడా తమ ఆత్మ కథ వ్రాసుకొన్నారు. మీరు తెలంగాణాకు మహాత్ముని వంటివారు. ఇక్కడ నిరంకుశ ప్రభుత్వ హయాములో శాంతియుతంగా ఒక మహోద్యమం నడిపారు. ఆ ఉద్యమం వల్ల ఇక్కడి ప్రజలలో ఎంతో చైతన్యం కలిగింది. ఉద్యమం ఆశయాలు నెరవేరాయి" అన్నాను. పంతులుగారు "మహాత్ముడెక్కడ !" అని నా అభ్యర్థనకు సమాధానం చెప్పకుండా మౌనంగా ఉండిపోయారు. స్వీయచరిత్ర వ్రాసుకోవడం వారికి ఇష్టం లేనట్లు వారి ముఖవైఖరివల్ల అప్పుడు నేను గ్రహించగలిగాను. ఇప్పటికీ వారి స్వీయచరిత్ర లేని కొరతను నాబోటి వాళ్ళంతా ఫీలవుతూనే ఉన్నారు. కొండా వెంకటప్పయ్యగారూ, ప్రకాశంగారూ, అయ్యదేవర కాళేశ్వరరావు గారూ వారి స్వీయ చరిత్రలను వ్రాసి తరతరాల ఆంధ్రులకు ఎంతో మేలు చేశారని విశ్వసించే వాళ్ళలో నేనొకణ్ణి చరిత్ర ప్రచార దృష్టితో కాక, యధార్థంగా ఏదో ఒక రూపంలో రికార్డు అయి ఉండాలి. మాడపాటి హనుమంతరావుగారు ఒకవేళ వ్రాసినా తమ కృషిని గూర్చి అంతగా వ్రాసేవారు కాదేమో అనికూడా నేను అనుకొంటూ ఉంటాను. వారు మాటలో మాత్రమే మితభాషి కాదు, వ్రాతలోకూడా మితము, మట్టు పాటించేవారు. విస్తృతి లేదు. సంక్షేపంగా వ్రాసేవారు. వేరొకరు వ్రాసి ఉంటే పంతులుగారు రచించిన 'తెలంగాణా ఆంధ్రోద్యమం' చరిత్ర అంతకు రెట్టింపు పుటల గ్రంథంగా వెలువడి ఉండేదనుకుంటాను. పంతులుగారు ప్రధానంగా కార్యవాది.

హనుమంతరావు పంతులుగారి శతజయంతి ఉత్సవాలు జరపాలని నిర్ణయం కాగానే ఒక రోజు మిత్రులు యం. యల్. నరసింహారావుగారు నాతో "మాడపాటివారి జీవిత చరిత్ర మీరు వ్రాయండి. శతజయంతి సందర్భంగా ప్రకటిద్దాము" అన్నారు. సరే అన్నాను. అన్నానే గాని తీరా పూనుకొనే సరికి ఇది కష్టసాధ్యమైన పని అనిపించింది. ఎందుచేతనంటే పంతులుగారి జీవిత విశేషాలను గూర్చి ఇతర ఆధారాలద్వారా తెలియ వచ్చేది చాలా తక్కువ. పంతులుగారిని గూర్చి ఒక మాదిరిగా తెలిపే పుస్తకం పూజ్యులు, నాకు గురుతుల్యులు శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు పంతులుగారి 81 వ జన్మదినోత్సవం సందర్భంగా వారిని సన్మానించడానికి ఆంధ్ర ప్రముఖులు నిర్ణయించినప్పుడు రచించిన 'ఆంధ్ర పితామహ పద్మభూషణ మాడపాటి హనుమంతరావు జీవిత చరిత్ర' ఒక్కటే. ఇతరులు పంతులుగారిని గూర్చి వ్రాసినవి పెద్ద వ్యాసాలు మాత్రమే. నా ఈ రచనకు ఆదిరాజు వీరభద్రరావుగారు వ్రాసిన పుస్తకమే ప్రధాన ఆధారం. దానినుంచే ఎన్నో అంశాలు, కథలు గాథలు తీసుకొన్నాను. పంతులుగారి జీవితంలో ముఖ్యంగా తొలి దశను గూర్చిన భోగట్టా ఆ ఒక్క పుస్తకంలో మాత్రమే లభ్యమవుతున్నది. ఇతరత్రా ఎక్కడా ఏమీ లభించదు. చెప్పేవారు ఇప్పుడు లేరు. అందుచేత ఆదిరాజు వారి పుస్తకం లేకపోతే ఇది వచ్చేది కాదు. పవిత్ర గంగాజలంలో నుంచి ఒక చెంబెడు నీళ్ళు ముంచి తీసుకొనే హక్కు ఎవరికైనా ఉందనుకుంటాను. ఇందుకు స్వర్గీయులు ప్రతిభాశాలి కర్మయోగి అయిన శ్రీ ఆదిరాజు వీరభద్రరావు గారికి కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. ఆ తర్వాత పంతులుగారి 'తెలంగాణా ఆంధ్రోద్యమం' రెండు భాగాలూ, వారి సమకాలికుల వ్రాతలూ నాకు ముఖ్యాధారాలయ్యాయి. ఈ రచన చేయడానికి అంగీకరించిన తర్వాత నా వ్యక్తిగత జీవితంలో ఒక గొప్ప విషాద సంఘటన జరిగింది. నేను ఏకాకినై పోయాను. అయినా ఆ నష్టానికి తట్టుకొని నిలిచి ఈ పని పూర్తిచేసే మహా భాగ్యాన్ని నాకు కలుగజేసి నందుకు ఆ పరమేశ్వరుని కృపా కటాక్షములను మరొకమారు స్మరిస్తున్నాను.

నా ఈ పుస్తకానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు దయతో తొలిపలుకు వ్రాశారు. పంతులుగారి వ్యక్తిత్వాన్నీ వారి కృషినీ బాగా ఆకళింపు చేసుకొన్న విజ్ఞులు వారు. యువకులుగా వారు తొలి రచన చేసినప్పటినుంచీ సాహిత్యకులుగా వారు అధిరో

హించిన శిఖరాలనూ, సాహిత్య సంస్థలద్వారా ఆంధ్ర వాఙ్మయాభివృద్ధికీ, వాఙ్మయ ప్రాచుర్యానికీ వారు చేసిన కృషిని పంతులుగారు సాక్షిగా గమనిస్తూ రావడమే గాక పలు సందర్భాలలో ప్రశంసకూడా చేసి ఉన్నారు. అట్లే రామానుజరావుగారు వారు రచించిన వ్యాసాలలో, పుస్తకాలలో సందర్భాన్ని బట్టి పంతులుగారి వ్యక్తిత్వాన్నీ వారి బహుముఖ సేవలనూ, కృషినీ ఎప్పటికప్పుడు మదింపు వేసి తమ అభిప్రాయాలను వ్రాసి ఉంచారు. అవి అమూల్యమైనవి. కనుక నా ఈ పుస్తకానికి తొలిపలుకు వ్రాయడానికి వారే తగిన వారని నేను అభిప్రాయపడ్డాను. మిత్రులు యం. యల్. నరసింహారావుగారు అడగగానే రామానుజరావుగారు వ్రాసి ఇచ్చారు. ఇందుకు వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖ కమీషనర్ శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఎ. ఎస్. గారు పరిచయ వాక్యాలు వ్రాశారు. వారికి నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకాన్ని ప్రచురించిన ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి శతజయంతి ఉత్సవాల నిర్వాహక సంఘానికి, ముఖ్యంగా యం. యల్. నరసింహారావుగారికీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికీ నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను, ఆంధ్ర పాఠకలోకం ఈ చిన్న జీవిత చరిత్రను ఆదరిస్తుందని ఆశిస్తున్నాను.

H. No. 1–8–726/30
నల్లకుంట, హైదరాబాదు–44
ఫిబ్రవరి 25, 1985.

డి. రామలింగం
రచయిత.

# పరిచయం

దేశ సేవను ఆదర్శంగా పెట్టుకొన్న వారిలో ఏదో ఒక రంగాన్ని ఎన్నుకొని కృషిసల్పి, ఆ రంగంలో ఉన్నత స్థాయిని అందుకొన్న ఉత్తములు అనేకులు మనకు కనిపిస్తారు. అయితే అనేక రంగాలలో అడుగిడి, అన్ని రంగాలలోనూ స్వార్థరహితంగా, సమర్థ వంతంగా తమ సేవలనందిస్తూ, ప్రతి రంగంలోనూ అగ్రస్థాయిలో నిలిచే ప్రముఖులు అరుదు. వ్రేళ్లపై లెక్కించదగిన అట్టి వారిలో స్వర్గీయ మాడపాటి హనుమంతరావు గారిని మొట్టమొదట పేర్కొన వలసి వుంటుందంటే అతిశయోక్తి కాదు.

చిన్నతనంలోనే లేమి అంటే ఏమిటో అనుభవ పూర్వకంగా అర్థం చేసుకొన్నారు వారు. జీవితం వడ్డించిన చేదు అనుభవాలను చవి చూశారు. గుమాస్తాగా జీవితాన్ని ప్రారంభించినా, వకీలుగా స్థిరపడి, స్వశక్తిపై అభివృద్ధిలోకి వచ్చారు. సంఘ సేవకుడిగా, జాతీయవాదిగా, స్వాతంత్ర్యయోధునిగా అనేక త్యాగాలు చేసి తమ బహుముఖ సేవల నందించారు, జాతికి. అనేక పదవులను - ముఖ్యంగా హైదరాబాదు నగర మేయరు, ఆంధ్రప్రదేశ్ విధాన పరిషత్తు అధ్యక్షత వంటి ఉన్నత స్థానాలను అలంకరించి, అందరి మన్ననలు అందుకొన్న ఆంధ్ర పితామహులు శ్రీ హనుమంతరావు గారు.

ఆయన అభిరుచి, కృషి, సేవ - ఏ ఒక్క రంగానికో పరి మితం కావు. ఆంధ్ర మహాసభ కార్యక్రమాలు, ఆంధ్రోద్యమం, ఆంధ్ర భాషా వికాసోద్యమం, స్త్రీ విద్య, గ్రంథాలయోద్యమం, వెట్టి చాకిరి నిర్మూలన, తాళపత్ర గ్రంథాలు, శాసనాలు మొదలయిన చారిత్ర కాధారాల సేకరణ, అస్పృశ్యతా నివారణ, వితంతు వివాహాలు, రజ స్వలానంతర వివాహాలు, బహుభార్యాత్వ నిషేధం, వేశ్యావృత్తి నిర్మూ

లన, సహపంక్తి భోజనాలు, జంతుబలి నిషేధం, గ్రామీణ రుణభార విముక్తికి కృషి, నీటిపారుదల, అబ్కారీ, అటవీ శాఖ మొదలైన వాటి పరిపాలనా విధానంలో, వాణిజ్య, వర్తక వ్యవస్థలలో మార్పుకై ప్రయత్నం, రైతు సమస్యల పరిష్కారానికి పూనిక, మతసామరస్యం - అది, యిది అని ఏమిటి - అనేక రంగాలలో ఆయన ప్రత్యేక ముద్ర ప్రభావం స్పష్టంగా, ప్రముఖంగా, అభినందనీయంగా కన్పిస్తాయి, ఆంధ్రప్రదేశ్ చరిత్ర పుటలపై. ఆయన చేయి పరుసవేది వంటిది. ఏ ఉద్యమంలో పాల్గొన్నా, ఏ కార్యక్రమం ప్రారంభించినా అది సక్రమంగా, విజయవంతంగా నెరవేరాల్సిందే. ఆయన పట్టుదల, నిరంతర కృషి, కర్తవ్యదీక్ష, కార్యదక్షత అలాంటివి.

హనుమంతరావు గారు ఉత్తమ రచయిత, కవి, సాహిత్య ప్రియులు, బహుభాషాకోవిదులు, చరిత్ర పరిశోధకులు, గ్రంథకర్త, రాజ్యాంగ నిపుణులు, ఇతర భాషా సాహిత్యాన్ని అందంగా తెనిగించిన అనువాదకులు. అన్నింటికి మించి ఆయన సౌజన్యశీలి, మృదుభాషి, పరోపకారి, అనురాగమూర్తి. ఒక్క మాటలో చెప్పాలంటే మరువరాని మనీషి.

తెలుగుతల్లికి తన బహుముఖ సేవలను అందించి, నవ్యాంధ్ర నిర్మాతలలో పేర్కొనదగిన నాయకులుగా అందరి ప్రశంసలు అందుకొన్న మాడపాటి హనుమంతరావు గారికి 'పద్మభూషణ్' వంటి బిరుదాలు, షష్టిపూర్తి ఉత్సవాలు చంద్రునికో నూలుపోగు వంటివి. ఆయనకు లభించిన గౌరవ సత్కారాలు, జాతి తనకు తాను చేసికొన్న సన్మానాలు.

ఆయన శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆ మహనీయుని జీవిత చరిత్రను చక్కని శైలిలో సమగ్రంగా అందించారు శ్రీ రామలింగంగారు. ఆయన చేయి తిరిగిన రచయిత. స్వయంగా జాతీ

యోద్యమంతో, నాయకులతో, సన్నిహిత సంబంధం కలిగిన ప్రముఖ జాతీయవాది. ప్రత్యేకంగా అభినందిస్తున్నాను వారిని ఇంతటి చక్కని కృషి సల్పినందుకు. శ్రీ మాడపాటి హనుమంతరావు శతజయంతి ఉత్సవ సంఘం వారు ఈ గ్రంధ రచనకు దోహదం చేకూర్చి, ప్రచురించి, తెలుగు పాఠక లోకానికి తమ అమూల్య కానుకగా సమర్పించటం ఎంతో అభినందనీయం.

ఆంధ్ర పితామహుని జీవిత గాధ, యధార్థంగా చూస్తే నవ్యాంధ్రప్రదేశ్ చరిత్రమే. అంతే కాదు, అది అనేక ప్రజా ఉద్యమాల చరిత్ర కూడ. ఇంతటి అమూల్యమైన గ్రంథానికి 'పరిచయం' వ్రాయమని నన్ను కోరిన మిత్రులు శ్రీ ఎం. ఎల్. నరసింహారావు గారికి, శతజయంతి ఉత్సవ సంఘ సభ్యులకు నా కృతజ్ఞతలు.

నాటి త్యాగమూర్తుల మహత్తర జీవిత విశేషాలను, అమూల్య సందేశాలను నేటి తరానికి అందించి, ప్రజలకు, ముఖ్యంగా యువతకు ఉత్తేజాన్ని, స్ఫూర్తిని ఇచ్చే ఈ ప్రయత్నాన్ని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు శతజయంతి ఉత్సవ సంఘం కృషి జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

పి. వి. ఆర్. కె. ప్రసాద్

హైదరాబాదు — ఐ. ఎ. ఎస్.

1-3-1985. — ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ కమీషనర్.

# తొలి పలుకు

అన్ని దేశాలలోను అన్ని కాలాలలోను నాయకులు ఎందరో ఉంటారు. కాని ప్రజల అభ్యుదయాన్ని లక్ష్యంగా పెట్టుకొని, దేశ సౌభాగ్యాన్ని తీర్చిదిద్దే మార్గదర్శకులైన మహనీయులు, త్యాగ మూర్తులు కొందరే ఉంటారు. ఈ కొందరి జీవితాలు అనుసరణీయాలు; వీరి జీవితాలు పఠనీయాలు. ఇటువంటి కొందరిలో స్వర్గీయ మాడపాటి హనుమంతరావు గారు చేరుతున్నారు. పూర్వపు నిజాం రాష్ట్రంలో అజ్ఞానం, పేదరికంలో మునిగిన తెలంగాణములో హనుమంతరావుగారు తమ జీవితాన్ని ప్రారంభించి దేశసేవకు, భాషాసేవకు నడుం కట్టి నారు. ఈ శతాబ్ది ప్రారంభంలో హైదరాబాదు నగరాన్ని తన కార్య క్షేత్రానికి కేంద్రంగా స్వీకరించి తెలంగాణా సర్వతోముఖాభివృద్ధికి హనుమంతరావుగారు కృషి చేసినారు. ఈ కృషిని ఈతరం వారికి, భావితరానికి పరిచయం చేసే ఉద్దేశంతో హనుమంతరావు శతజయంతి ఉత్సవ సంఘం వారు యీ జీవిత చరిత్రను ప్రకటించడం సర్వవిధాల సముచితం.

ఆంధ్రోద్యమానికి, గ్రంథాలయోద్యమానికి ఇంకా అనేక దేశాభ్యుదయకరమైన ఉద్యమాలకు హనుమంతరావుగారు నాయకత్వము వహించి ఆ రోజులలో తెలంగాణమును మేలుకొలిపినారు. ఇప్పటి వరకు తెలుగులో వారి జీవిత చరిత్రలను, రచనలను ప్రకటించడానికి కొన్ని ప్రయత్నాలు జరిగినవి. 1944 లో వారి షష్టిపూర్తి సందర్భంలో ప్రకటితమైన ప్రత్యేక సంచికలో ఒక వ్యాసం వ్రాస్తూ వారి ఆప్తమిత్రు లైన స్వర్గీయ ఆదిరాజు వీరభద్రరావుగారు అప్పటివరకు మాత్రమే వారి జీవితాన్ని వ్రాసినారు. ఆ తరువాత- అనగా ఇటీవలి సంవత్స రాలలో శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు రచించిన 'జాతి రత్నాలు' లోను, శ్రీ ఎం. ఎల్. నరసింహారావుగారు వ్రాసిన 'తెలంగాణా వైతా ళికులు' లోను హనుమంతరావుగారి జీవిత చరిత్రలు ప్రకటితమైనవి. గడచిన సంవత్సరం 'ఆంధ్ర సారస్వత పరిషత్తు', హైదరాబాదు పక్షాన హనుమంతరావు గారి జీవితాన్ని గూర్చి ఏర్పాటు చేసిన ఉప న్యాసం త్వరలోనే ప్రకటితం కాగలదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకా డమి పక్షాన తెలుగు వైతాళికులు సంస్మరణ సభల వరుసలో హను

మంతరావుగారి జీవితాన్ని, దేశసేవ, భాషాసేవలను తెలియజేసే రెండు ఉపన్యాసాలను చేయించి పుస్తక రూపంగా ప్రకటించనైనది. అయితే హనుమంతరావు గారి జీవిత చరిత్ర గ్రంథరూపంగా రావలసి ఉన్నది. ఆ అవసరాన్ని తీర్చే ఉద్దేశంతో 'శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం' ఏర్పాటు చేసిన శతజయంతి ఉత్సవ సంఘం యీ గ్రంథం ప్రకటించి సకాలంలో సరియైన పని చేసింది. ఇందుకు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషా నిలయాన్ని, భాషానిలయ కార్యవర్గాన్ని అభినందించ వలసి ఉన్నది. ఈ గ్రంథాలయ అభివృద్ధికి హనుమంత రావుగారు చేసిన కృషి గణనీయమైనది. అంతేకాదు, హైదరాబాదు నగరంలోను, తెలంగాణాలో అనేక ప్రాంతాలలోను అనేక విద్యా, వైజ్ఞానిక, సారస్వత సంస్థలను హనుమంతరావుగారు స్థాపించి వాటి పెంపు సొంపులకు కారణభూతులైరి. తెలంగాణాలో ప్రజా జీవితం పంతులు గారి కృషితోనే ప్రారంభమైనదన్న మాట నూటికి నూరు పాళ్లు సత్యం.

పరిమాణంలో చిన్నదైనప్పటికిని ఈ గ్రంథం మాడపాటి హనుమంతరావుగారి బహుముఖమైన కృషికి, ఉన్నత వ్యక్తిత్వానికి, ఉదార చరిత్రకు చక్కని ప్రతిబింబంగా ఉన్నది. తెలుగు తెలిసిన ప్రతివారు ముఖ్యంగా యువతీ యువకులు, అందులోను విద్యార్థులు తప్పక చదువ దగినదీగ్రంథం. ఈ గ్రంథకర్త శ్రీ డి. రామలింగంగారు చేయి తిరిగిన రచయిత. సుమారు ముప్పై సంవత్సరాలకు పైగా సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలతో గాఢమైన సంబంధం కలిగి, బహుభాషలలో ప్రవీణుడై ఇంతకు పూర్వం అనేక రచనలు గావించిన సమర్థుడు. రామలింగంగారు సుబోధకమైన సరళ శైలిలో ఈ గ్రంథాన్ని రచించి తెలుగు భాషకు మరొక జీవిత చరిత్రను సమకూర్చినారు. ఇందుకు రామలింగం గారికి హార్దికమైన అభినందనలు. శ్రీకృష్ణదేవరాయ భాషా నిలయం, శతజయంతి ఉత్సవ సంఘం ఈ సందర్భంలో చేసిన, చేస్తున్న కృషి ప్రశంసనీయం. సకలాంధ్రులకు అవశ్య పఠనీయమైన ఈ జీవిత చరిత్రకు సుస్వాగతం.

**దేవులపల్లి రామానుజరావు**
అధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

హైదరాబాదు
21-2-1985.



ఆంధ్ర పితామహ

శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు

# జననం, విద్యాభ్యాసం, ఉద్యోగం

"హైదరాబాదు చరిత్రలో శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారికి ఉండేస్థానం ఇంకెవ్వరికీ ఉండదనే నా విశ్వాసం. హైదరాబాదు రాష్ట్ర ప్రజలలో చైతన్యం కలుగడానికి వారెక్కువ పనిచేశారని చెప్పుటలో నాకెట్టి సందేహంలేదు" అంటూ ఆంధ్ర మహాపురుషులలో ఒకరైన గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ఒకానొక సందర్భంలో ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారి వ్యక్తిత్వమునకు విలువకట్టుతూ తమ అభిప్రాయం చెప్పారు.

తెలుగు భాష విస్మరింపబడిన తెలంగాణములో తెలుగుకు గౌరవస్థానం కలిగించి, ఇచటి తెలుగువారిలో 'మేము ఆంధ్రులము' అన్నభావాన్ని పెంపొందజేసి, తక్కిన అన్ని ప్రాంతాలకంటె అనేక విధాల వెనుకబడి ఉన్న తెలంగాణసీమలో ఆంధ్రోద్యమాన్ని ఆరంభింపజేసి, దానిని విజయవంతంగా నడిపి. ఎందరో యువకులను తమ ఉన్నతాశయములతో ప్రజాహిత కార్యదీక్షతో ప్రభావితులనుచేసి, వారిపై నాయకత్వభారాన్ని ఉంచి చక్కని ప్రజాసేవకు ఒరవడిపెట్టి, గ్రంథాలయోద్యమము, సంఘ సంస్కరణము, స్త్రీ విద్యావ్యాప్తి, ప్రజాసేవారంగంలో స్త్రీల ప్రవేశం, సాంఘికోద్ధరణ, విద్యాప్రచారం, సాహిత్యవికాసంవంటి అనేక ఉద్యమాలను ఒక్కచేతిమీదుగా ఏకకాలంలో ప్రవర్తిల్లజేసి, ప్రజలలో సర్వతోముఖమైన జాగృతిని కలుగజేసి నిజాం రాష్ట్ర ఆంధ్రుల రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పునరుజ్జీవనానికి కారకులై, ఇచటి ప్రజలచే అపూర్వమైన ఆదరాభిమానా

లతో ఆంధ్ర పితామహ, అని పిలువబడిన హనుమంతరావు పంతులు గారు ఆంధ్రుల చరిత్రలో శాశ్వత యశఃకాయులై నిలుస్తారు.

మహానదులు అవి పుట్టినచోట చాలా చిన్నవిగా ఉంటాయి. కాని పోనుపోను పెద్ద ప్రవాహంతో జీవనదులన్న పేరు పొందుతాయి. హనుమంతరావు పంతులుగారి పుట్టుకకూడా అంతే. వీరు శాలివాహన శకం 1806 తారణనామ సంవత్సర మాఘ శుద్ధ షష్టి గురువారంనాడు-అనగా క్రీ.శ. 1885 జనవరి 22 తేదీన కృష్ణాజిల్లా నందిగామ తాలూకా పొక్కునూరు గ్రామంలో జన్మించారు. తండ్రి మాడపాటి వెంకటప్పయ్య గారు, తల్లి వెంకటసుబ్బమ్మగారు. మాడపాటివారు ఆర్వేల నియోగి శాఖకు చెందిన బ్రాహ్మణులు. ఆపస్తంబసూత్రులు. కౌశికస గోత్రికులు, వెంకటప్పయ్యగారు గ్రామాధికార పదవిని నిర్వహిస్తూ అతిధి అభ్యాగతులను సత్కరిస్తూ ధన్యజీవితం గడిపారు. వీరికి ఇద్దరు కుమారులు. పెద్ద కుమారుడు తిరుమలరావు, రెండవ కుమారుడు హనుమంతరావు. వెంకటప్పయ్యగారు అకాలమరణం చెందడంచేతను, వీరిది కలిమిగల కుటుంబం కాకపోవడంచేతను తల్లి కొడుకులు కష్టదశ నెదుర్కోవలసి వచ్చింది. తండ్రి మరణించేనాటికి తిరుమలరావు వయస్సు 8, హనుమంతరావు వయస్సు 5. వెంకటసుబ్బమ్మగారు జమలాపురం వారింటి ఆడపడచు. ఈమెకు జమలాపురం వెంకటరావు, రామచంద్రరావు అనే ఇద్దరు సోదరులుండేవారు. వెంకటరావుగారు సూర్యాపేటలో తహసీలు కచేరీలో పేష్కారు ఉద్యోగంలో ఉండేవారు. వారి పోషణలోనే తిరుమలరావు, హనుమంతరావు పెరిగారు. సూర్యాపేటలో హనుమంతరావు సాతాని తిరునగరి నరసయ్య అనే ఉపాధ్యాయుని ప్రైవేటుబడిలో మూడేళ్ళు చదివారు. వెంకటరావుగారికి ఇబ్రాహింపట్నం బదిలీకాగా వీరు అక్కడ కొంతకాలం చదువుకొన్నారు. ఈ గ్రామాలలో పై తరగతులకు చదివే పిల్లలకు తగిన పాఠశాలలు లేవు.

అందుచేత రెండవ మేనమామ రామచంద్రరావుగారు పేష్కారుగా ఉన్న నల్లగొండకు వీరు పంపబడ్డారు. అక్కడ ఉర్దూ, ఫారసీ, తెలుగు చదువుకొని 1898 లో ఉర్దూ మిడిల్ పరీక్షలో ఉత్తీర్ణులైనారు. ఆ కాలంలో అదే పెద్ద పరీక్ష. మరి పై చదువులకు వెళ్ళాలంటే ఇంగ్లీషు అవసరం. అందుచేత హనుమంతరావు ఇంగ్లీషు నేర్చుకొని 1900 లో ఇంగ్లీషు మిడిల్ పరీక్షలో కృతార్థులయ్యారు. తర్వాత హనుమకొండ లోని ఉన్నత పాఠశాలలో చేరి మద్రాసు విశ్వవిద్యాలయ మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు. అప్పుడు వీరివయస్సు 18 ఏండ్లు, దీనికి నాలుగేండ్లు ముందు పెద్ద మేనమామ, రెండేళ్ల ముందు చిన్న మేనమామ దివంగతులైనారు. కొంతకాలం అన్నగారైన తిరుమలరావు గారి సహాయంతో చదువు సాగించారు. తిరుమలరావుగారు వైరుపాలెంలో స్థిరనివాసమేర్పరచుకొని వకీలు వృత్తిచేసేవారు. వారికి బనిగండ్లపాడు గ్రామాధికార పదవికూడా ఉండేది. హనుమంతరావుకు కళాశాల విద్య అభ్యసించే అవకాశం లేకపోయింది చదువు పూర్తి అయిన కొద్ది కాలానికే వీరు తమ చిన్న మేనమామగారి కుమార్తె అన్నపూర్ణమ్మను వివాహమాడారు. 1904లో వరంగలుజిల్లా విద్యాశాఖాధికారి కార్యాలయంలో నెలకు రూ. 40 వేతనంపై మీర్‌మున్షీ ఉద్యోగం లభించింది. అప్పుడు వీరి వయస్సు 19. ఎనిమిది సంవత్సరాలు హనుమకొండలో ఆ ఉద్యోగం చేశారు. అప్పుడు అక్కడ విద్యాశాఖ ఇనస్పెక్టర్లుగా ఉన్న శ్రీనివాసాచారి, హార్డికర్ వంటి ప్రముఖులవద్ద వీరు దక్షతతో తమ ఉద్యోగ బాధ్యతలను నిర్వహించారు.

కాని ఈ గుమాస్తా ఉద్యోగం తమ వ్యక్తిత్వ వికాసానికి తగింది కాదని వారు గ్రహించారు. పైగా అది సంఘసేవకు ఆటంకంగా ఉంది. మొదటినుంచీ ప్రజాహిత జీవితంపై వారి దృష్టి ఉండేది. అందుకు

ప్రభుత్వోద్యోగం పెద్ద ప్రతిబంధకం. న్యాయవాద వృత్తివల్ల మాత్రమే ఏమిచేయడానికైనా స్వాతంత్ర్యం ఉంటుంది. ఆ కాలంలో హైదరాబాదులో 'లా' క్లాసులు నడుపబడుతూ ఉండేవి. వాటికి హాజరై వకాలత్ పరీక్ష ఇచ్చి ఎందరో న్యాయవాదులవుతూ ఉండేవారు. హనుమంతరావుగారు హనుమకొండ ఉద్యోగానికి సెలవుపెట్టి హైదరాబాదు వెళ్ళి 'లా' క్లాసులో చేరారు. సరిగా అప్పుడే నిజాం ప్రభుత్వ శాసన నిర్మాణ శాఖలో ఇంగ్లీషు, ఉర్దూ, తెలుగు భాషలలో ప్రవీణుడైన అనువాదకుడు కావలెనన్న ప్రకటన చదివి వీరు దరఖాస్తు పెట్టుకొన్నారు. పట్టభద్రులను కాదని వీరినే ఆ ఉద్యోగానికి ఎంపికచేశారు నెలకు రూ. 100 వేతనంపై అయిదేండ్లు ఆ ఉద్యోగం చేశారు. శాసన నిర్మాణ శాఖాధికారిగా ఉన్న రాజాబహద్దర్ కృష్ణమాచారిగారు హనుమంతరావుగారి దక్షతను మెచ్చుకొనేవారు. శాసన అనువాదకుని విధులను నేర్పుతో నిర్వహిస్తూనే వీరు ఆ అయిదేళ్ళకాలంలో ప్రైవేటుగా వకీలు పరీక్షకు చదివి, వకాలత్ పరీక్షకు కూర్చొని దర్జే అవ్వల్ వకాలత్ పరీక్షలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులై, శాసన నిర్మాణశాఖ ఉద్యోగానికి 1917 లో రాజీనామా ఇచ్చి న్యాయవాద వృత్తిని చేపట్టారు. మొదట ప్రముఖ న్యాయవాదియైన రాయ్‌విశ్వేశ్వర్‌నాథ్‌గారి వద్ద ఒక సంవత్సరం జూనియర్‌గా పని చేశారు. రాయ్‌విశ్వేశ్వర్‌నాథ్‌గారు ఉత్తర భారతదేశం నుంచి వచ్చి హైదరాబాదులో స్థిరపడి వకీలుగా పెద్ద పేరు ప్రఖ్యాతులు గడించారు. తర్వాత న్యాయమూర్తి అయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి పదవికూడా అలంకరించి రాజాబహద్దర్ బిరుదం పొందారు. జూనియర్‌గా అనుభవంగడించిన హనుమంతరావుగారు హైదరాబాదులో స్వతంత్రంగా ప్రాక్టీసు ఆరంభించారు.

# న్యాయవాది

హనుమంతరావుగారి జీవితంలో న్యాయవాదవృత్తిదశ 1917 లో ఆరంభమైంది. ఈ వృత్తిని అవలంబించడంలో వారి ఉద్దేశం ఆ వృత్తిలో పైకివచ్చి వేలు లక్షలు గడించి హైకోర్టు న్యాయమూర్తివంటి ఉన్నతపదవిని పొందడంకాదు. ఆ వృత్తివల్ల కొంత జీవనోపాధి లభిస్తుంది. ముఖ్యంగా వాక్ స్వాతంత్ర్యం, కార్యాచరణ స్వాతంత్ర్యం ఉంటాయి. ప్రజలతో ప్రత్యక్ష సంబంధం ఉంటుంది. ప్రజాసేవకు అవకాశమిచ్చే వృత్తి ఇది.

పంతులుగారు న్యాయవాదవృత్తిని కొంత జంకుతోనే ఆరంభించారు. ఆ రోజులలో హైదరాబాదు నగరంలో బారెట్లా, బి. ఎ. ఎల్. ఎల్ బి. పట్టాలతో, గదులనిండా పుస్తకాలతో, ఆడంబరంగా ప్రాక్టీసు చేసే లాయర్లు ఉండేవారు. వారు కోర్టులకు టాంగాలలో కార్లలో వెళ్ళివస్తూ ఉండేవారు. అటువంటివారి మధ్య ఒక మెట్రిక్యులేటు అవ్వల్ దర్జావకాలత్ పట్టాతో లాయర్‌వృత్తిలో నెగ్గుకు రావడం ఏటికి ఎదురీదడమే. అయితే పంతులుగారు అవలంబించిన పద్ధతివల్ల వారు ఆ వృత్తిలో నిలువగలిగారు. క్లయింట్లకోసం ఎదురుచూచే అవసరం వారికి లేకపోయింది.

వృత్తిలో వారు కేవలం నిజాయితీతో వ్యవహరించేవారు. కక్షివారు ఒక కేసు విషయంలో తమను న్యాయవాదిగా కుదుర్చుకోవడానికి తమవద్దకు వచ్చినప్పుడు అతని పత్రాలను సాకల్యంగా చదివి అది తాము చేపట్టతగిన యోగ్యమైన వ్యవహారమని, అంతా సక్రమంగా

ఉందని తోచితేనే కేసును స్వీకరించేవారు. అందులో సారం లేకపోతే, లేదా దగాకోరు వ్యవహారంగా కన్పిస్తే ఆ కేసును తీసుకొనేవారు కారు. ఇది కక్షిదారులకు బాగనిపించేదికాదు. అయినా పంతులుగారు తమపద్ధతి ప్రకారమే పోయేవారు. న్యాయమైన ఫీజే తీసుకొనేవారు. ఒకమారు ఒక కక్షిదారు వీరివద్దకు వచ్చాడు. వీరు అతని కేసునంతా పరిశీలించి "కేసులో పసలేదు. నీవు గెలువలేవు. ఇటువంటి వ్యవహారాలలో వకీళ్ళను పెట్టుకొని డబ్బు విచ్చలవిడిగా ఖర్చుపెట్టడంకంటె అవతలి పార్టీతో రాజీపడి, వచ్చినంతవరకు రాబట్టుకోవడమే మేలు" అని హితవు చెప్పారు. కాని ఆ కక్షిదారు వీరి సలహా వినలేదు. పైగా ఈయన ఏమి వకీలు! అని పంతులుగారిని గూర్చి చాలా తక్కువ అంచెనాకూడా వేసుకొన్నాడు. వెంటనే మరొక వకీలు దగ్గరకు వెళ్ళాడు. ఆయన తన సంభాషణా చాతుర్యం ప్రదర్శించి, కేసు చేపట్టి ఫీజు బాగా లాగాడు. కాని ఫలితం సున్నా అయింది. అప్పుడతనికి పంతులుగారు చెప్పిన హితోక్తులు జ్ఞాపకమొచ్చాయి. వెంటనే మిఠాయి కొనుక్కొని పంతులుగారి వద్దకు వెళ్ళి పొట్లాన్ని వారి బల్లపై ఉంచాడు. పంతులుగారు సంగతేమిటని అడిగారు. "అయ్యా! మీరు చెప్పిన సలహా పాటించక కొన్ని వందల రూపాయలు ఖర్చుపెట్టాను. ఇప్పుడు నాకు జ్ఞానోదయమైనది. కృతజ్ఞతాసూచకంగా నేను తెచ్చిన ఈ కానుకను స్వీకరించి నన్ను ఆనందపరచండి. తమవంటి వకీళ్ళు కొందరుంటే ప్రజలు బాగుపడి పోతారు" అన్నాడు. పంతులుగారు న్యాయవాద వృత్తిలో ఎల్లప్పుడూ వృత్తిధర్మంకంటె మానవ ధర్మానికే ఎక్కువ విలువఇచ్చారు.

ఒక కేసులో హనుమంతరావుగారి కక్షిదారుడు ఓడిపోయాడు. పంతులుగారికి మనస్తాపం కలిగి ఖిన్నులయ్యారు. తన లోపమేమిటని వితర్కించుకోసాగారు. కక్షిదారునికన్నా వారే ఎక్కువ బాధపడుతూ ఉన్నారు. ఇది గమనించిన న్యాయమూర్తి అక్బర్‌యార్‌జంగ్ బహద్దరు

పంతులుగారిని తమ చేంబరుకు పిలిపించుకొని కూర్చోనమనిచెప్పి "కేసు పోయినందుకు విచారిస్తున్నట్లున్నావు. ఈ వృత్తిలో జయాపజయాలు సహజమే. నీవంటి యువక న్యాయవాది అధైర్యపడకూడదు. ఈరోజు నీవాదం చక్కగానే ఉంది. గట్టిగాకూడా వాదించావు. కాని వాద ప్రతి వాదాలే చాలవు. మేము న్యాయ సూక్ష్మాలను కూడా గమనించవలసి ఉన్నది. వాటినిబట్టి ఒక నిర్ణయానికివచ్చి తీర్పు చెప్పుతాము. కనుక కలిగిన అపజయానికి విచారింపక, ఆ న్యాయసూక్ష్మమేమిటో గ్రహించ డానికి ప్రయత్నిస్తే ఈవృత్తిలో రాణిస్తావు" అన్నారు. న్యాయమూర్తి తనవాదం చక్కగానే ఉన్నదని అంగీకరించినందుకు పంతులుగారు కొంతలో కొంత సంతృప్తి చెందారు.

ఒక కేసులో ప్రతివాదిపక్షాన హనుమంతరావు పంతులుగారు, వాదిపక్షాన మాదిరాజు రామకోటీశ్వరరావుగారు ఉన్నారు. వీరిద్దరూ ఆ తర్వాత నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభ అధ్యక్షులయ్యారు. ఇద్దరూ మితవాదులే. ఇద్దరికీ బంధుత్వం కూడా ఉంది. రామకోటీశ్వరరావు గారు హనుమకొండనుంచి వచ్చి పంతులుగారి ఇంట్లోనే బసచేశారు. ఇద్దరు వకీళ్ళు కలిసే కోర్టుకు వెళ్ళారు. అలా వెళ్ళుతూ ఉండగా పంతులుగారు తనవెంట తెచ్చుకొన్న 'నీలగిరి' పత్రిక సంపుటాలను తిరగవేస్తూఉంటే రామకోటీశ్వరరావుగారు "కోర్టుకు కూడా పత్రిక ఎందుకయ్యా- అక్కడా నీ సాహిత్యం గొడవేనా" అని వేళాకోళంగా అన్నారు. పంతులుగారు చిరునవ్వు తెచ్చుకొని మిన్నకున్నారు.—ఆ రోజు వాయిదాకు ప్రతివాది సాక్షులు రాలేదు. కనుక వాదిపక్షాన తీర్పు చెప్పవలెనని రామకోటీశ్వరరావుగారు కోర్టులో గట్టిగా వాదించారు. హనుమంతరావుగారు లేచి తన కక్షిదారు, అతని సాక్షులు పెనుతుఫాను మూలంగా రాలేకపోయారనీ, మరొక వాయిదా ఇప్పించవలసిందనీ కోర్టువారికి మనవిచేసుకొన్నారు. అంతట రామకోటీశ్వరరావుగారు లేచి,

ఇదివట్టిసాకు. తుపానుకూ ప్రతివాదికీ ఏమీ సంబంధంలేదు" అని గర్జించారు. అంతట హనుమంతరావుగారు 'నీలగిరి' పత్రిక తీసి అందులో వర్ణింపబడ్డ తుపాను భీభత్సం వార్తను కోర్టువారికి చదివి వినిపించి, తన కక్షిదారు గ్రామంవదలడానికి ఎట్లావీలుకాకపోయిందో వివరించారు. కోర్టువారు వీరివాదంలోని నిజాన్ని గ్రహించి కేసు వాయిదా వేశారు. అప్పుడు రామకోటీశ్వరరావుగారు "బావా, ఇందుకా 'నీలగిరి' పత్రికలు తెచ్చావు. ఎంతమోసం చేశావయ్యా" అని మేలమాడారు.

హనుమంతరావుగారు న్యాయవాద వృత్తిలో అపజయం మాత్రం పొందలేదు. కలిగిన అపజయాలవల్ల మధ్యలో ఆ వృత్తిని విడనాడ లేదు. వారికి నెలకు రూ. 600 దాకా ఆదాయం వస్తూ ఉండేది. వీరి సౌజన్యము, సత్యశీలము కక్షిదారులనేగాక సాటి న్యాయవాదులనుకూడా ఆకర్షించేవి. న్యాయమూర్తులు వీరంటే మన్నన గౌరవం చూపేవారు.

హైదరాబాదులో అనేక న్యాయస్థానాలు ఉండేవి. ఇప్పటికీ ఉన్నాయి. అందుచేత ఒకే వకీలు అన్ని కోర్టులలో ఒకేసారి వ్యవహారం జరపడం సాధ్యంకాదు కాబట్టి పరస్పరం సన్నిహితులైన నలుగురు వకీళ్ళు ఒక గ్రూపుగా ఏర్పడి కేసులను తమలోతాము పంచుకొన్నారు. ఆ నలుగురు వీరు: కొండా వెంకటరంగారెడ్డి, మాడపాటి హనుమంత రావు, మందుముల రామచంద్రరావు, శ్రీనివాసరెడ్డి - ఈ వకీళ్ళు నలుగురిలో ఎవరి వద్దకు ఏ కక్షిదారు వచ్చినా ఆయన ఫీజు వగైరా నిర్ణయించేసి ఆ వ్యాజ్యానికి సంబంధించిన కోర్టు న్యాయవాది వద్దకు పంపుతూ ఉండేవారు. ఈ పరస్పర సహకార సిండికేటు పద్ధతి అటు వకీళ్ళకూ, ఇటు వ్యాజ్యదారులకూ కూడా సౌకర్యవంతంగా ఉండేది. హనుమంతరావుగారు మాల్గుజారీవ్యవహారాలు (రెవిన్యూ బోర్డు కేసులు) వాదించే వకీలు, అని అప్పుడు నలుగురూ కలిసి నిర్ణయించారు.

పంతులుగారి న్యాయవాదవృత్తి దశలోనే వారి ప్రజాసేవాభిలాషకు తగు పునాదులు పడ్డాయని చెప్పవచ్చు. కక్షిదారులు వీరివద్దకు వచ్చినప్పుడు వారి వ్యవహారపు ముచ్చటలు ముగిసిన పిమ్మట పంతులుగారు వారితో నిజాం రాష్ట్రంలోని రాజకీయ, విద్యా, వ్యవసాయ, వాణిజ్య పరిస్థితులనుగూర్చి వారికి విడమరచి చెప్పుతూ, సాంఘికాభివృద్ధి విషయమై ప్రబోధంచేస్తూ ఉండేవారు. ఇట్టి ప్రబోధంవల్ల కక్షిదార్లు సాంఘిక రాజకీయ స్థితిగతులను అర్థంచేసుకొని ఆ తర్వాత అనేక ప్రజోద్యమాలలో పంతులుగారికి చేదోడువాదోడుగా ఉండి, సంఘసేవకులుగా దేశసేవకులుగా సిద్ధమైనారు. విద్యాధికులుకూడా పంతులుగారితో ఒకమారు సంభాషిస్తేచాలు, ఎంతో ప్రభావితులయ్యేవారు. "నేనూ కాడ్డోగాప్పో చదువుకొన్నవాడినే. కాని శ్రీ హనుమంతరావుగారితో మాట్లాడిన తర్వాత నా విజ్ఞానం ఏపాటి అని నాకనిపించింది. ఆయనకెన్ని విషయాలు తెలుసు! ఎంత సునిశితమైన దృష్టి! ఎంత చక్కగా విడమరచి చెప్పారు!" అని ఒక విద్యావంతుడు ఆశ్చర్యం వెలిబుచ్చాడు. ఇట్లా పంతులుగారు పామరులలో, విద్యావంతులలో ఎంతో జాగృతి కలుగజేసి ఆనాటి హైదరాబాదు సంస్థానంలో ఉత్సాహం కలవారూ, సంగతిసందర్భాలు ఎరిగినవారూ ప్రజాసమస్యలను చేపట్టి, సంఘసేవకు పూనుకోవలసిన అగత్యాన్ని వారికెరిగించి ప్రజాసేవకు చక్కని బాటలు వేశారు.

ఈవిధంగా పంతులుగారు ఇటు న్యాయవాదులలోను, అటు అధికారులలోను రాజకీయ ఆర్థిక సాంఘిక, సాంస్కృతిక చైతన్యం కలుగజేస్తూ ఉండేవారు. ఆ రోజులలో ఐ.సి.యస్. అధికారి టాస్కర్ నిజాం రాష్ట్ర పోలీసు రెవిన్యూశాఖల మంత్రిగా ఉండేవారు. హనుమంతరావు గారికి ఆయనతో మంచి మైత్రి ఏర్పడింది. పంతులుగారు రెవిన్యూ కేసులు వాదించే వారు కదా. రెవిన్యూ మంత్రి అయిన

టాస్కర్‌గారి ఎదుటకూడా వారు కొన్ని వ్యాజ్యముల సందర్భంగా వాదించవలసి వచ్చేది. కోర్టువ్యవహారం ముగిసిన తర్వాత టాస్కర్ గారు పంతులుగారిని కూర్చోబెట్టి ప్రజావ్యవహారాలను గూర్చి సంభాషణ సాగించేవారు. పంతులుగారు ప్రజల సమస్యలను వారికి విశదంగాచెప్పి, ప్రభుత్వంవారి కార్యవిధానంలోని లోపాలను వారికెరిగించి, అధికారుల కర్తవ్యం ఏమిటో సూచించేవారు. ముఖ్యంగా ఆంధ్రోద్యమాన్నిగూర్చి పై వారికిగల అనుమానాలనూ అపోహలనూ తొలగింప యత్నిస్తూ ఉండేవారు. ఇట్లా న్యాయవాదిగా పనిచేస్తూ పంతులుగారు ప్రజోద్యమాలకు అధికార వర్గాలలో చక్కని పబ్లిక్ రిలేషన్స్ వ్యవహర్తగా కూడా పనిచేసి అధికారులలో ప్రజా ఉద్యమాలంటే సదవగాహన కలిగించడానికి ప్రయత్నిస్తూ ఉండేవారు..

హనుమంతరావు పంతులుగారు న్యాయవాదులైన నాయకులను గూర్చి సున్నితమైన వ్యంగ్యంతో కూడిన చలోక్తులను విసురుతూ అప్పుడప్పుడు ప్రసంగించేవారు. వాటిలో ఒక ఛలోక్తి* "కొండావెంకటరంగారెడ్డిగారు న్యాయవాద వృత్తిని విజయవంతంగా కొనసాగించి అందులో రాణించినారు. నేను అతి కష్టంమీద నా షష్టిపూర్తివరకు ఈ వృత్తిని సంసార పక్షంగా లాగినాను. మందుముల నరసింగరావుగారు 7, 8 సంవత్సరాలు ఈ వృత్తిలో ఉండి నిరాశచెంది అది తమ చిత్త వృత్తికి గిట్టక వదలివేసినారు. ప్రతాపరెడ్డిగారు రెండు సంవత్సరాల అనుభవంలోనే వదిలివేసినారు. మా అందరికన్న రామానుజరావు ముందడుగు వేసినాడు. ఎల్ ఎల్.బి. డిగ్రీ తీసుకొని వృత్తికి కావలసినటువంటి సౌకర్యాలు అన్నీ కలిగి ఉండి కూడా సనదు తీసుకోలేదు. కోర్టులో అడుగుపెట్టలేదు." ఈ ఛలోక్తిని తమ పుస్తకంలో రామానుజరావుగారు ప్రస్తావిస్తూ తాము న్యాయవాద వృత్తిని చేపట్టకపోవడానికి కారణం హనుమంతరావు పంతులుగారి సలహాయేనని చెప్పాలి అన్నారు. విద్యావంతులైన యువకులు దేశసేవ, భాషాసేవ చేయాలనే ఉద్దేశంతో వారు ఇటువంటి సలహాలు ఇస్తుండేవారని చెప్పారు.

---

*'యాభై సంవత్సరాల జ్ఞాపకాలు'—దేవులపల్లి రామానుజరావు.

# వ్యక్తిత్వ వికాసం

హనుమంతరావుగారి వ్యక్తిత్వ వికాసం హనుమకొండకు విద్యా సముపార్జన నిమిత్తం వచ్చినప్పటినుంచే మొదలైందని చెప్పవచ్చు. ఆది వరంగలు జిల్లాకు ముఖ్యపట్టణం. అప్పుడు ఖమ్మం కూడా వరంగలు జిల్లాలో ఒక భాగమే. హైదరాబాదు రాష్ట్రంలో వరంగలు ఒక సూబాగా ఉండేది. అంటే కొన్ని జిల్లాలుగల ఒక ప్రాంతం. ఆ ప్రాంతానికి వరంగలు కేంద్రం. విద్యాసంస్థలు, విద్యావంతులు, ప్రభుత్వ ఉన్నతోద్యోగులు నివసించే పట్టణమది. ఆ కాలంలో మూడు ఉద్యమాలు ప్రజలలో కొంత సంచలనం కలిగిస్తున్నాయి. ఒకటి ఆంధ్ర భాషోద్యమం. రెండవది కందుకూరి వీరేశలింగం పంతులుగారిచే ఆంధ్ర ప్రాంతంలో ఆరంభింపబడ్డ సంఘసంస్కరణోద్యమం. మూడవది భారత జాతీయ కాంగ్రెసు దినదినాభివృద్ధి చెందడంవల్ల దేశమంతటా వ్యాపిస్తూ వున్న రాజకీయచైతన్యం, రాజకీయోద్యమం.

ఆంధ్రమహాపురుషులలో అగ్రేసరుడూ, విఖ్యాత చరిత్రకారుడూ అయిన కొమర్రాజు లక్ష్మణరావుగారు హైదరాబాదువచ్చి ఆంధ్ర భాషా ప్రచారానికీ, విజ్ఞానవ్యాప్తికీ ఇక్కడినుంచే తమకృషిని ఆరంభించారు. క్రీ॥శ॥ 1900 లో- అంటే ఇరవయ్యో శతాబ్ది ఆరంభంలో శ్రీకృష్ణదేవ రాయ భాషానిలయం హైదరాబాదులో స్థాపింపబడింది. 1907 లో లక్ష్మణరావుగారు హైదరాబాదులో విజ్ఞానచంద్రికా గ్రంథ మండలిని స్థాపించి తెలుగులో విజ్ఞానదాయకమైన గ్రంథములు ప్రచురింపసాగారు. 1904 లో హనుమకొండలో శ్రీ రాజరాజనరేంద్ర భాషానిలయం

స్థాపింపబడింది. ఈ మూడు సంఘటనలతో తెలంగాణాలో ఆంధ్ర భాషోద్యమం ఆరంభమైంది. హైదరాబాదునుండి హనుమకొండకు వచ్చే మిత్రులు భాషానిలయం కార్యకలాపాలను గూర్చి హనుమంత రావుగారికి చెబుతూ ఉండేవారు. వీరు ఆ నిలయంనుండి ఆంధ్ర గ్రంథాలు తెప్పించుకొని తమ మిత్రులతోపాటు చదివేవారు. కొమర్రాజు లక్ష్మణరావుగారి వ్యక్తిత్వంచేత, వారి భాషాకృషిచేత హనుమంతరావు గారు బాగా ప్రభావితులైనారు. ఆదిపూడి సోమనాథరావు, మైలవరపు నరసింహశాస్త్రిగారలు ఆ రోజులలో రచించి హైదరాబాదు సభలలో చదివిన ఆంధ్ర భాషాభిమాన పూరితాలైన పద్యాలు పంతులుగారిని ఎంతగానో ఆకర్షించాయి:

అచ్చతెనుంగుకబ్బమున కాదిపదంబయి పొల్చుభాగ్యమున్
హెచ్చుగగన్న దేశమిది యేదురదృష్టమొ యాంధ్రభాష నే
డిచ్చట సొంపునింపు చెడి హీనదశార్తిని గుందెనక్కటా
అచ్చపుటాంధ్ర పుత్రులకు నందరకున్ తలవంపులౌనటుల్

అంటూ ఆదిపూడి సోమనాథరావుగారు వ్రాసిన పద్యమూ—

ఘనులార! సత్యవర్తనులార! తనివార
మన్నించుడీ యాంధ్రమాతనెపుడు
దయులార! సద్గుణోదయులార! దయమీర
భూషించుడీ యాంధ్రభాష నెపుడు
హితులార! శ్రీయుతోన్నతులార! మితిమీర
వినుతించుడీ యాంధ్రవిద్యనెపుడు
నయులార! సజ్జనప్రియులార! మనసార
కరుణించుడీ యాంధ్రకాంత నెపుడు

పూజితామల సౌజన్య పూర్ణులార !
ధైర్య గాంభీర్యయుత మనస్థైర్యులార !
మానితాఖండ భాషాభిమానులార!
పూని పోషింపుడీ యాంధ్రసూనులార !

అని పండిత మైలవరపు నరసింహశాస్త్రిగారు చేసిన ప్రబోధమూ హనుమంతరావుగారిని ఆకట్టుకొన్నాయి. విజ్ఞానచంద్రికా గ్రంథమండలి తరఫున ప్రచురింపబడ్డ మొదటి పుస్తకమైన 'అబ్రహాం లింకన్' చరిత్ర పీఠికలో కొమ్మరాజు లక్ష్మణరావుగారు వ్రాసిన వర్తమానాంధ్రవాఙ్మయ పరిస్థితి పర్యాలోకనం పంతులుగారిని విశేషంగా ఆకర్షించింది. దానిని గూర్చి ఎంతోఉత్సాహంతో మిత్రులతో ముచ్చటించేవారు. ఆ గ్రంథాన్ని రెండవసారి ముద్రించేటప్పుడు ఆ సింహావలోకనాన్ని తీసివేసి ముద్రించి నందుకు చింతిస్తూ వీరు పత్రికాముఖంగా తమ అసంతృప్తిని వ్యక్తం చేశారుకూడా. ఈ గ్రంథమండలివారు ప్రచురించిన హిందూమహా యుగం, మహమ్మదీయ మహాయుగం, అను చరిత్ర గ్రంధాలు వీరిని ఉత్తేజపరిచాయి. తెలుగు భాషా సాహిత్యాలను అభివృద్ధిపరచవలసిన ఆవశ్యకతను వీరు గుర్తించారు.

ఆ రోజులలో విద్యావంతులైన యువకులను ఆకర్షించిన రెండవ ఉద్యమం సంఘ సంస్కరణోద్యమం. ఆంధ్రదేశంలో ఈ ఉద్యమానికి మూలపురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఆయన సంఘసంస్కరణతోపాటు ఆధునికాంధ్ర వాఙ్మ యాన్ని తమరచనలచే ఎంతో సుసంపన్నం చేశారు. అంతేకాక స్త్రీ జనోద్ధరణకూ- ముఖ్యంగా స్త్రీలలో విద్యావ్యాప్తికీ ఆయన కృషిచేసి, స్త్రీలకొరకు ప్రత్యేకంగా పుస్తకాలుకూడా వ్రాశారు. ఆయన ఆరం భించిన సంఘ సంస్కరణోద్యమం యావద్భారతములో సంచలనం

కలిగించడమేకాక వ్యక్తుల ఆత్మలను వికసింపజేసింది. ఆయన మూఢ నమ్మకాలను గర్హించాడు. ఏకేశ్వరోపాసనమును సమర్థించాడు. వితంతు వివాహములు, రజస్వలానంతర వివాహములు జరగవలె నన్నాడు. వేశ్యా వృత్తిని అరికట్టవలెనని ఉద్బోధించాడు. సంఘంలోని దురాచారాలను ఖండించాడు. సంఘీభావం, మతసహనం అవసరమన్నాడు. ఆయన ఉద్యమం హృదయంకలవారి నందరినీ కదలించింది. గ్రామాలలో, రచ్చ బండలవద్ద, వార్తాపత్రికలలోనూ, ఆ ఉద్యమాన్ని గూర్చి చర్చలు ముమ్మరంగా జరుగుతూ ఉండేవి. ఆ రోజులలో వార్తాప్రసార సాధనాలు లేకపోయినప్పటికీ ఆయన ఆరంభించిన ఉద్యమం దక్షిణదేశమంతటికీ తెలియవచ్చింది. పంతులుగారు రాజరాజనరేంద్ర ఆంధ్రభాషానిలయం నుండి వీరేశలింగంగారి రచనలు పది సంపుటాలనూ సంపాదించి చదివి ఆ మహనీయుని సందేశాన్ని జీర్ణింపజేసుకొన్నారు. ముఖ్యంగా ఖమ్మం మెట్టు తిరుమలరావుగారితో మైత్రికారణంగాకూడా సంఘ సంస్కరణో ద్యమం వీరిపై గాఢమైన ముద్రవేసింది. వీరేశలింగంగారి భావాలేకాదు, ఆయన వచన రచన శైలి కూడా వీరిని ప్రభావితంచేసింది. దానిని అనుసరించే సరళగ్రాంధిక రచన వీరికి అలవడింది. వీరేశలింగంగారు చెప్పిన స్త్రీ విద్యావ్యాప్తి, మతసహనం, సంఘీభావం అనేవి వీరి జీవితా నికి మార్గదర్శకాలై, ఆ తర్వాత తెలంగాణాలో వీరు ఆంధ్రోద్యమం నడిపినప్పుడు ఆ సూత్రాలను పూర్తిగా పాటించి ఉద్యమానికి బలం, చైతన్యస్ఫూర్తి, సాంఘికంగా అభ్యుదయ దృక్పథం ఆపాదింప జేయగలిగారు.

హనుమంతరావుగారు, భారతజాతీయ కాంగ్రెసు ఒకే సంవత్స రం—అనగా 1885లో పుట్టడం జరిగింది. పంతులుగారు పెరిగేకొద్దీ జాతీయ కాంగ్రెసు ఉద్యమంకూడ దేశంలో విస్తరించి ప్రజలలో జాతీయ భావాలను అంకురింపజేస్తూపోయి, దేశంలో మున్నెన్నడూ

లేని రాజకీయచైతన్యాన్ని కలిగించింది. దేశీయుల సమస్యలను పాలకుల దృష్టికి తేవాలంటే సుసంఘటితమైన, అన్ని వర్గాల ప్రాతినిధ్యంకల దేశీయుల మహాసభ ఒకటి అవసరమని భారతీయులకు తెలియవచ్చింది. జాతీయ కాంగ్రెసు మహాసభలు, ఆ సభలలో నాయకుల ఉపన్యాసాలు విద్యావంతులను మిక్కుటంగా ఆకర్షించేవి. బెంగాలు విభజనవల్ల స్వదేశీ ఉద్యమం, విదేశవస్తు బహిష్కారం భారతదేశమంతటా వ్యాపిజెందాయి. అంతేగాక పౌరస్వత్వములు, స్వపరిపాలనం, బ్రిటిషువారి ఆర్థిక నీతి శాసన సభల నిర్మాణం, పరాయి పాలనవల్ల పన్నులభారం వంటి సమస్యలు దేశీయులను ఆలోచింప జేశాయి. 1906లో జరిగిన కలకత్తా భారత జాతీయ కాంగ్రెసు మహాసభలో దాదాభాయి నౌరోజీ "భారత దేశీయుల ఆదర్శం స్వరాజ్యం" అని చాటడంతో దేశమంతటా కాంగ్రెసు, స్వరాజ్యం అన్నమాటలు వ్యాపిజెందాయి. గోపాలకృష్ణ గోఖలే, బాలగంగాధర తిలక్, ఫెరోజ్‌షామెహతా వంటి భారతీయ నాయకుల పేర్లు అందరికీ పరిచయమయ్యాయి. బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రదేశంలో పర్యటించి తన ఉపన్యాసాలద్వారా ప్రజలను ఉత్తేజ పూరితులను చేశాడు. వంగదేశంలో రాజుకొన్న చిచ్చు దక్షిణదేశానికీ వ్యాపించింది. భారతదేశమంతటా రాజకీయ ఝంఝూ మారుతం వీచ సాగింది. ఈ విషయాలన్నీ విద్యార్థులుగావున్న హనుమకొండ యువకులకు పత్రికలద్వారా, ప్రముఖ వ్యక్తులద్వారా తెలియ వస్తున్నాయి. అవి వారిని జాగృతం చేయడమేగాక వారిలో దేశాభిమానోద్దీపక బీజాలు నాటాయి.

హనుమకొండలో పత్రికలు పుస్తకాలు చదువుతూ, దేశ రాజకీయాలను బాగా అవగాహన చేసుకొంటూ ఉన్న యువకులు ఒక కూటమిగా చేరి ఏ రోజు విశేషాలను ఆ రోజు చర్చించేవారు. భారత దేశంలో వస్తూవున్న రాజకీయ సంచలనానికి వారు సుముఖులనీ,

జాతీయ భావాలపట్లనే వారి సానుభూతి అనీ వేరే చెప్పనక్కరలేదు. ఆ రోజులలో జాతీయ నాయకులలో మితవాదులు, అతివాదులు అని రెండు వర్గాలవారుండేవారు. మితవాద, అతివాద భావాలను గూర్చి హనుమకొండ యువకులు తర్జన భర్జనలు చేసేవారు. ఈ చర్చలలో వారొక వినోదకరమైన పద్ధతి అవలంబించారు. వారి వారి ధోరణులను బట్టి ఒక్కొక్కరికి ఒక్కొక్క భారతీయ నాయకుని పేరు పెట్టారు. అట్లా — ముత్కవి వాసుదేవరావు గారిని ఫెరోజ్‌షా మెహతా అనేవారు. గుర్రాజురావు గారికి సురేంద్రనాథ బెనర్జీ అని పేరు. ఇట్లా ఇతరులకు కూడా వారి వారి వైఖరి ననుసరించి దేశ నాయకుల పేర్లు పెట్టారు. మాడపాటి హనుమంతరావు గారిని గోపాలకృష్ణ గోఖలే, అన్నారు. ఇతరుల విషయంలో వారికి పెట్టబడ్డ పేర్లు తగినవో కాదో మనకు తెలియదుగాని, హనుమంతరావు గారికి పెట్టిన పేరు వారికి ఎంతైనా తగినదని అంగీకరింపక తప్పదు. అప్పుడు భారతదేశ రాజకీయ నాయకులలో గోపాలకృష్ణ గోఖలే మితవాది. సామరస్య వైఖరిని సమర్థించిన అభిజ్ఞుడు. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీని స్థాపించి దేశీయులలో సేవాభావమును పెంపొందింప జేసిన కర్మయోగి. చిత్తశుద్ధికి నీతివర్తనమునకూ పేరు పడ్డవాడు. గొప్ప రాజనీతిజ్ఞుడు. అర్థశాస్త్రవేత్త, విద్యాభిమాని. తన జీవిత సర్వస్వాన్ని భరతమాత చరణముల వద్ద ధార వోసిన ధన్యజీవి. కనుక గోఖలే వంటివాడు అని అనిపించుకోవడం ఎంత గొప్ప విషయం! హనుమంతరావు గారికి గోఖలే అన్న పేరు ఆ తర్వాత వారి వ్యక్తిత్వాన్ని బట్టి సార్థక బిరుదమే అయింది. గోఖలేవలె పంతులుగారిది కూడా నిండుకుండవలె తొణకని వ్యక్తిత్వం. ఏ ప్రజా ఉద్యమంలోనైనా వీరూ మితవాదులే. తీవ్రమైన ధోరణి ఎప్పుడూ లేదు. నడతలో ఆలోచనలో పలుకులో, రచనలో, వ్యవ

హార నిర్వహణలో తొందరపడక, పూర్వాపరాలను బాగా యోచించి అడుగు ముందుకు వేసేవారు. గోఖలేవలె వీరుకూడా నిస్వార్థ సేవకు ప్రాధాన్య మిచ్చారు. పంతులుగారి సేవ రాజకీయ పార్టీల ముఖంగా జరిగినది కాదు. నిర్మాణాత్మకమైన సంస్థలద్వారా జరిగింది. రాజకీయాలలో తలమునకలు కావడం వీరికి ఇష్టంలేదు.అట్లాగే మత సంస్థల ద్వారా పనిచేయడానికీ వీరు సుముఖత చూపలేదు. సర్వమత సామరస్యం వీరి విధానం. మత ప్రసక్తిలేని లౌకిక విధానాన్ని వీరు తమ ప్రజాసేవలో పాటించారు. తమ వైఖరికి అనుగుణంగా వున్న సంస్థలద్వారా ఆర్భాటం లేకుండా నిరాడంబరంగా సేవచేసి ఆంధ్రప్రజల శ్రేయస్సుకు పాటుపడజూచారు. మొత్తంపై తెలుగు భాషా సాహిత్యాల అభివృద్ధి, సంఘ సంస్కరణ దృక్పథంతో తెలుగు ప్రజలు సామాజికంగా అభ్యుదయం సాధించడం, భారతీయులుగా అన్ని మతాలవారూ వర్గాలవారూ జాతీయతాభావంతో వ్యవహరించడం హనుమంతరావుగారి ప్రజాహిత జీవన ఆదర్శాలుగా ఉండేవి. న్యాయవాదియై స్వేచ్ఛను పొంది ప్రజాహిత జీవనం ఆరంభించిన తర్వాత ఈ ఆదర్శాలను ముందుంచుకొనే వీరు ప్రజాసేవకు ఉపక్రమించారు.

# గ్రంథాలయోద్యమ పోషకుడు

గ్రంథాలయాలంటే నాటి నిజాం ప్రభుత్వ దృష్టిలో విప్లవ సంఘాలు (రెవల్యూషనరీ బాడీస్). మూడవ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు ప్రభుత్వ అనుమతి కోసం మాడపాటి హనుమంతరావుగారు, బూర్గుల రామకృష్ణారావుగారు రాష్ట్ర పోలీసు మంత్రి అయిన కర్నల్ ట్రెంచ్ వద్దకు వెళ్ళినప్పుడు అంతకు ముందు జరిగిన రెండవ ఆంధ్ర మహాసభలో చర్చింపబడ్డ తీర్మానాలపై ప్రభుత్వ ప్రతినిధులు ఆక్షేపణలు లేవదీశారు. అప్పుడు బూర్గులవారు "మా ఉద్యమం కేవలం రాజకీయేతర మైనది. విశేషంగా గ్రంథాలయాల మూలంగా విజ్ఞానం వ్యాపింపజేసే ఉద్యమం" అని వారికి నచ్చజెప్ప ప్రయత్నించారు. అప్పుడు అక్కడ ట్రెంచ్‌గారితో పాటు ఆసీనులై వున్న పోలీసు ఇనస్పెక్టర్ జనరల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అనే మహాశయుడు "గ్రంథాలయోద్యమం అంటే ఏమిటో నాకు బెంగాలులో మంచి అనుభవం కలిగింది. గ్రంథాలయాలంటే విప్లవ సంఘాలు. అంతే. మరేమీ కావు" అన్నాడు. ఆ వైఖరినే నిజాం ప్రభుత్వం అనుసరిస్తూ గ్రంథాలయాలు అసలు స్థాపించబడకుండా, ఎక్కడైనా స్థాపింపబడినా వాటిని పని చేయనీయకుండా అభ్యంతరాలు చెబుతూ వాటిని మూసివేయింప చూస్తూ వుండేది.

తెలంగాణా పరిస్థితులను చక్కగా అవగాహన చేసుకున్న హనుమంతరావుగారు ఆంధ్రభాషా ప్రియులు కావడంచేత, ఆంధ్ర భాషోద్ధరణకు గ్రంథాలయాలే ముఖ్య సాధనాలని గ్రహించి జిల్లాలలో

ఓరీవిగా గ్రంథాలయాలను నెలకొల్పడం ద్వారా భాషా ప్రచారం చేయ సంకల్పించారు. నిద్రావస్థలో వున్న ప్రజలను గ్రంథాలయోద్యమమే మేల్కొల్పగలదని వారి దృఢ విశ్వాసం.

పంతులుగారు హనుమకొండలో విద్యాశాఖ ఇనస్పెక్టర్‌గారి కార్యాలయంలో పనిచేస్తూ ఉన్నప్పుడే శ్రీ రాజరాజ నరేంద్ర గ్రంథాలయ కార్య నిర్వహణ బాధ్యత వహించి దానికి కార్యదర్శిగా పనిచేస్తూ గ్రంథాలయ అభివృద్ధికి పాటుపడుతూ వుండేవారు. "పోలీసువారు విద్యాశాఖ ఇనస్పెక్టర్ గారితో రహస్యంగా ఏమి చెప్పారో ఏమో, ఆయన హనుమంతరావు గారిని గ్రంథాలయ కార్యదర్శి పదవికి రాజీనామా ఇవ్వమని నిర్బంధించారు. మాడపాటివారు నిమిత్తమాత్రం తొలగి కొండపల్లి సీతారామారావు గారిని కార్యదర్శిగా ఏర్పాటు చేయించి గ్రంథాలయం పని అంతా తాము చూస్తూ వుండేవారు. తర్వాత గ్రంథాలయానికి ఎన్నికలు జరిపించి మాదిరాజు రామకోటీశ్వరరావు గారిని కార్యదర్శిగా చేశారు"* హనుమంతరావు పంతులుగారికి ఈ గ్రంథాలయమంటే గొప్ప అభిప్రాయం ఉండేది. ఇది నిజాం రాష్ట్రం లోని తెలుగు జిల్లాలలో గ్రంథాలయోద్యమానికి శంకుస్థాపన మొనర్చిన లైబ్రరీ అనీ, ఇచటి ఆంధ్రోద్యమానికి పునాది అనదగినదనీ వారు ఒక చోట వ్రాశారు.

పంతులుగారు ఆ కాలంలోనే నిడదవోలు గ్రంథాలయ సభలకు వెళ్ళారు. రాజమండ్రి వెళ్ళి గౌతమీ గ్రంథాలయం చూచారు.

తెలంగాణాలో మారుమూల గ్రామాలలో సైతం గ్రంథాలయాలు ఏర్పడటానికి పంతులుగారు ఒక విధంగా మూలపురుషులని చెప్పవచ్చు.

---

* మాదిరాజు రామకోటీశ్వరరావుగారి స్వీయచరిత్రలో.

ఈ గ్రంథాలయాలు పాఠకులకు పత్రికలు పుస్తకాలు లభింప జేయడమే గాక, సభలకూ సమావేశాలకూ కవితా గోష్ఠులకూ, వివిధ సంస్థల వార్షికోత్సవాలకూ కూడా ఉపయోగపడి, తెలంగాణా ప్రజలను మేల్కొల్పినవి. ఇవి జిల్లా ప్రజలలో రాజకీయాభిప్రాయాలను కొంత వరకు వ్యాపింప జేసినవనీ, గ్రంథాలయముల వలన విద్యాధికులగు నగర వాసులకు రాజకీయ సాహిత్యం విరివిగా లభించినదనీ పంతులు గారే ఒక వ్యాసంలో వ్రాశారు. ఇవి ప్రజలలో విజ్ఞానతృష్ణను పెంపొందించాయి. యువకులలో రచన చేయవలెనన్న ఉత్సాహం కలుగజేశాయి. తెలంగాణాలో కలిగిన రాజకీయ చైతన్యానికి గ్రంథాలయాలే ముఖ్య కారణం. రాజకీయ ఆర్థిక సాంఘిక విద్యా వైజ్ఞానిక సాంస్కృతిక రంగాలలో కృషి చేసిన ప్రజాసేవకులకు ఇవి ఆటపట్టులు. వీటివల్ల భాషాభివృద్ధి, విద్యావ్యాప్తి, విజ్ఞాన ప్రచారం జరిగాయి. తెలంగాణాలో 1922 నుంచి ఆరంభమైన ఆంధ్రోద్యమం అతి త్వరగా రాష్ట్రమంతటా వ్యాపించడానికి ఇవి మార్గం సుకరం చేశాయి. ఆంధ్రోద్యమం మొదటి దశలో తెలంగాణా అంతటా గ్రంథాలయాలు స్థాపించి, మాతృభాషా వ్యాప్తికి, పత్రికా పఠనానికీ దోహదం చేశారు.

హనుమంతరావు పంతులుగారు ఆంధ్రజన కేంద్రసంఘం కార్యదర్శిగావుండి, కేంద్ర సంఘంలో గ్రంథాలయ శాఖకు ఒక ప్రత్యేక కార్యదర్శిని 1337 ఫసలీలో నియమించారు.

తెలంగాణాలో గ్రంథాలయోద్యమం ఆంధ్రోద్యమం కన్నా పురాతనమైనది కదా ! ఆంధ్రోద్యమం మరొక సంవత్సరానికి ఆరంభమవుతుందనగా సూర్యాపేటలోని ఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయాన్ని

ఆ జిల్లా తాలూక్దారు (కలెక్టరు) తన పర్యటన సందర్భంగా వచ్చి చూచాడు. ఆంధ్ర గ్రంథాలయ మొకటి తాలూకా ప్రధాన కేంద్రంలో కేవలం ప్రజల సహాయంతో నడపబడటం ఆ అధికారికి ప్రభుత్వాధిక్కారంగా తోచిందేమో! "ఈ గ్రంథాలయాన్ని స్థాపించడానికి ప్రభుత్వం వారి అనుమతి పొందినారా లేదా?" అని అచటి కార్యకర్తలను ప్రశ్నించాడు. లేదని సమాధానం వచ్చేసరికి "ప్రభుత్వం వారి అనుమతి పొందేవరకూ గ్రంథాలయాన్ని మూసి వుంచండి" అని ఆజ్ఞాపించాడు. అంతట కార్యకర్తలు హైదరాబాదు వచ్చి ఆ సంగతి హనుమంతరావు పంతులుగారికి తెలిపారు. పంతులుగారు అప్పుడు హోం సెక్రెటరీగా వున్న సర్ అక్బర్ హైదరీ గారికి ఒక లేఖ వ్రాస్తూ "తాలూక్దారు జిల్లా లోకల్‌ఫండ్ బోర్డుకు కూడా అధ్యక్షుడు. అట్టి అధ్యక్షుడు ప్రజల గ్రంథాలయాలకు ధన సహాయము చేయుచుండునని వినియుంటిని గాని గ్రంథాలయములను మూసి వేయించునని వినలేదు. ఈ విషయమున న్యాయము చేయవలెను" అని కోరారు. హోంసెక్రెటరీగారు ఈ విషయాన్ని విచారిస్తానని తెలిపి, తాలూక్దారునుండి జవాబు తెప్పించుకొని పంతులుగారికి తిరిగి ఇట్లా వ్రాశారు. "గ్రంథాలయములను స్థాపించుటకు ఈ కార్యాలయము నుండి (ప్రభుత్వము నుండి) ఆజ్ఞ పొందవలసిన అవసరంలేదు" అని పంతులుగారికి తెలిపారు. అప్పుడు ఆ గ్రంథాలయం మళ్ళీ తెరవబడింది. పంతులుగారి జోక్యంవల్ల ఈ పేచీ పరిష్కారమైంది.

ఆ తర్వాత వరంగలు జిల్లా మడికొండ గ్రామం గంథాలయం విషయంలోకూడా ఇటువంటి పేచీయే రాగా ఆంధ్రజన కేంద్రసంఘం కార్యదర్శి అప్పటి హోంసెక్రెటరీ గారి హుకుంకోసం వ్రాశారు. కాని

దానికి జవాబు 21 సంవత్సరాల వరకూ రాలేదు. గ్రంథాలయాలలో ఎక్కడ ఏ సంఘటన జరిగినా పంతులుగారికి ఆ విషయం తెలియవస్తూ ఉండేది. మడికొండ గ్రంథాలయం విషయంలో ఆశ్చర్య పడవలసిన విశేషమేమిటంటే ప్రభుత్వ ఉత్తర్వు పొందేవరకూ ఈ గ్రంథాలయాన్ని మూసి వుంచవలసిందని కోర్టువారు ఉత్తరువు పంపడం !

కరీంనగరు జిల్లాలోని సిరిసిల్ల గ్రంథాలయాన్ని చూచిన అక్కడి తహశీల్దారు "సర్కారువారి దస్తరఖులలో వ్యవహారమంతా ఉర్దూలో ఉండగా చచ్చిపోయిన తెలుగును బైటికి గుంజవలసిన పనిలేదు" అని అన్నాడట. ఆ రోజులలో తెలుగుభాష అంటే నిజాం ప్రభుత్వ ఉద్యోగికి అంతటి ద్వేషం ! పైగా రాష్ట్రంలోని అధిక సంఖ్యాక ప్రజల భాష తెలుగు అని తెలిసివుండి కూడా !

తెలంగాణాలో ఆంధ్రోద్యమం ప్రారంభమయ్యే నాటికి - అనగా 1922 వరకల్లా సుమారు 15 గ్రంథాలయాలు స్థాపించ బడ్డాయి. వరంగల్లులో శబ్దాను శాసన గ్రంథాలయం, ఖమ్మంలో జ్ఞాన విద్యుత్ప్రవాహినీ భాషా నిలయం, మెరుపాలెంలో మహబూబియా గ్రంథాలయం, రేమిడిచర్లలో సిద్ధి మల్లేశ్వర గ్రంథాలయం, నల్లగొండలో ఆంధ్ర సరస్వతీ గ్రంథ నిలయం, హైదరాబాదులోని గౌలీగూడాలో బాల సరస్వతీ ఆంధ్ర గ్రంథాలయం, నాంపల్లిలో వేమన ఆంధ్రభాషా నిలయం స్థాపింప బడ్డాయి. వీటి నిర్వహణకు హనుమంతరావు గారు తోడ్పడ్డారు. వేమన ఆంధ్ర భాషా నిలయానికి భవనం నిర్మించడం కోసం స్థల నిర్ణయం చేయడం, దాని కొనుగోలు వ్యవహారం చూడడానికి గాను ఎన్నుకోబడ్డ ఉపసంఘంలో పంతులుగారు సభ్యులు. అట్లాగే బాలసరస్వతి గ్రంథాలయానికి భవనం ఏర్పాటు చేసే విషయంలో

కూడా వారి తోడ్పాటు వుంది. హనుమకొండలోని రాజరాజ నరేంద్ర భాషా నిలయానికి శాశ్వత భవన నిర్మాణం విషయంలో పంతులుగారు మునగాల రాజావారిని దర్శింపగా వారు కొంత విరాళమిచ్చారు.

ఈ గ్రంథాలయాలలో రాజకీయాలు చర్చింప బడుతున్నాయేమో నని పోలీసువారు అనుమానించి నిఘావేసి ఉంచేవారు. గ్రంథాలయ వార్షికోత్సవ సభలకు ముందుగానే అధికారుల అనుమతి పొందవలసి వుండేది. జిల్లా తాలూక్దారు అనుమతి ఇచ్చేవారు. గ్రంథాలయాలకు ప్రభుత్వ సహాయం కోరకూడదని హనుమంతరావుగారి పట్టుదల. సహాయం కోరితే పోలీసులు, సి.ఐ.డి. లు వచ్చి తనిఖీ చేస్తూ వుంటారు.

ఆంధ్రజన కేంద్ర సంఘం మూడవ సమావేశం 1925 ఫిబ్రవరిలో మధిరలో జరిగినప్పుడు అక్కడే తెలంగాణా మొదటి గ్రంథాలయ సభను పంతులుగారు ఏర్పాటు చేయించారు. ఈ సభలో వారు గ్రంథాలయోద్యమ విస్తరణకై కొన్ని విధానాలు సూచించారు. 1928 లో నాల్గవ ఆంధ్రజన కేంద్రసంఘ సమావేశం సూర్యాపేటలో జరిగినప్పుడు రెండవ గ్రంథాలయ సభను ఏర్పాటు చేశారు. ఈ సభకు దేశభక్త వామన రామచంద్రనాయక్ గారిని పంతులుగారు తీసుకువచ్చి వారి అధ్యక్షతన సభ జరిపించారు. ఈ గ్రంథాలయ సభతోపాటే ఆంధ్ర యువక సభ, సంఘ సంస్కార సభ, ఆంధ్ర మహిళాసభ, వైశ్య యువజన సభకూడా జరిగాయి. స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవం, వర్తక సంఘ వార్షికోత్సవంకూడా జరిగాయి. వివిధ వర్గాల వారిలో కదలిక పుట్టించడం, గ్రంథాలయోద్యమానికి జన బాహుళ్యంలో విస్తృతి కలిగించి చైతన్యం విస్తరింప జేయడం ఈ

బహుముఖ కార్యక్రమాల ముఖ్యోద్దేశం. సూర్యాపేట రెండవ గ్రంథాలయ మహాసభలో పంతులుగారు సభలను సమావేశాలనూ, వాక్స్వాంతంత్ర్యాన్నీ అరికట్టే ఉద్దేశంతో నిజాం ప్రభుత్వం అమలులోకి తెచ్చిన గష్తీ నిషాన్ 53 (సర్క్యులర్ నెం. 53) ను ప్రత్యేకంగా సభవారి దృష్టికి తెచ్చి ప్రభుత్వం వారు విద్యా, విజ్ఞాన ప్రచారానికి సంబంధించిన విషయంలో కూడా కఠినమైన నిర్బంధాలు విధిస్తున్నందుకు విచారం ప్రకటించారు. ఆలంపురం వద్ద క్యాతూరులో 1946 లో రాజాబహద్దర్ వెంకటరామ రెడ్డిగారి అధ్యక్షతన జరిగిన 26 వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభను హనుమంతరావుగారే ప్రారంభించారు.

పంతులుగారు హైదరాబాదు నగరంలో స్థిరపడ్డ తర్వాత శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయాన్ని వృద్ధిచేయ బూనుకొన్నారు. అప్పుడు ఈ నిలయానికి స్వంత భవనం లేదు. నెలకు నాలుగున్నర రూ. ల అద్దె చెల్లిస్తూ చిన్న గదిలో ఈ లైబ్రరీ ఉండేది. ఈ గ్రంథాలయం పాఠకులను విశేషంగా ఆకర్షిస్తూ వుండేది. పత్రికలూ పుస్తకాలూ వస్తున్నాయి. నానాటికీ దీని సేవ అధికమవుతూ ఉండటంచేత ఒక భవనాన్ని కట్టించ వలసిన ఆవశ్యకతను సభ్యులు గుర్తించారు. పంతులుగారు 1914–15 సంవత్సరానికి ఈ భాషా నిలయం కార్యదర్శి పదవిని చేపట్టిన తర్వాత భవన నిర్మాణానికి ప్రయత్నాలు చేయసాగారు. వీరు రావిచెట్టు రంగారావుగారి ధర్మపత్ని శ్రీమతి లక్ష్మీనరసమ్మ గారిని ప్రోత్సహించగా ఆమె తన భర్త రంగారావు గారి స్మృతి చిహ్నంగా భవన నిర్మాణంకోసం రూ. మూడువేలు విరాళమిచ్చారు. ఆ ధనంతో భవన నిర్మాణాన్ని ఆరంభింప జేశారు. ఆమె మరికొంత ధనసహాయం చేసేవారే, కాని అకాలమరణం పొందారు.

అయినప్పటికీ పంతులుగారు పూనుకొని విరాళాలు సేకరించారు. వీరి ఈ కృషి ఫలితంగా 1918 లో ప్రారంభమై 1921 లో పూర్తి అయిన శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం భవన ప్రవేశోత్సవం 1921 సెప్టెంబరు 30 తేదీన ప్రముఖ విద్యావేత్త కట్టమంచి రామలింగారెడ్డి గారి అధ్యక్షతన వైభవోపేతంగా జరిగింది. ఈ విధంగా హైదరాబాదు నగరంలో 1901 లో స్థాపింపబడిన మొట్టమొదటి సార్వజనీన గ్రంథాలయానికి స్వంత భవనమేర్పడింది. ఈ భాషా నిలయ స్వర్ణోత్సవ సంచికలో బూర్గుల రామకృష్ణారావు గారు 'రజతోత్సవోదంతము' అనే శీర్షికతో భాషా నిలయం యొక్క యాభై సంవత్సరాల చరిత్రను సమీక్షిస్తూ "మందిర నిర్మాణమునందు నిరంతరము కృషి సల్పి ధన సంగ్రహము గావించిన శ్రీయుత మాడపాటి హనుమంతరావు గారు ఈ నిలయాభివృద్ధి గావించిన వారిలో ముఖ్యులని వేరే చెప్పనక్కరలేదు" అని వ్రాశారు. పంతులుగారి గ్రంథ పఠనాసక్తి, వీరి ప్రతిభ, వీరికి గల పలుకుబడి ఈ భాషా నిలయం అభివృద్ధికి దోహదం చేశాయి. కాబట్టే ఒక కవి "ఆంధ్ర పితామహు నల్లారుబిడ్డ మాయాంధ్రభాషా నిలయంబు గనుడు" అని పాడినాడు.

శ్రీ కృష్ణదేవరాయ ఆంధ్ర భాషా నిలయం రజతోత్సవ, స్వర్ణోత్సవ, వజ్రోత్సవాలను పంతులుగారు వైభవంగా జరిపించారు. ఇట్లా తెలంగాణాలో గ్రంథాలయోద్యమానికి వీరు పోషకులుగా వ్యవహరించి ఉద్యమానికి పుష్టిని చేకూర్చారు.

హనుమంతరావు పంతులుగారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం గౌరవ సభ్యులుగా ఎన్నిక కావడమేగాక, కొంతకాలం ఆ సంఘ కార్యవర్గంలో సభ్యులుగా కూడా ఉన్నారు.

# ఆంధ్రోద్యమ నిర్మాత

తెలంగాణాలో ఆంధ్రోద్యమం వేరు. ఆంధ్ర ప్రాంతంలో ఆంధ్రోద్యమం వేరు. ఆంధ్ర ప్రాంతంలోని ఉద్యమం ప్రధానంగా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కోసం జరిగింది. తెలంగాణాలోని ఆంధ్రో ద్యమం హైదరాబాదు రాజ్యంలో ఎనిమిది జిల్లాలలో నివసించే తెలుగు వారి మాతృభాషను పునరుజ్జీవింపజేసి, తెలుగు భాషా సాహిత్యాల అభి వృద్ధిని సాధించడానికీ, ఇక్కడి ప్రజలకు సాంఘిక, ఆర్థిక, రాజకీయ హక్కులను చేకూర్చడానికీ, ఈ ప్రజలలో సాంస్కృతికంగా చైతన్యం కలుగజేయడానికీ ఉద్దేశింప బడింది.

నిజానికి అప్పటి హైదరాబాదు సంస్థానంలో ఆంధ్రోద్యమం ఎన్నడో ఆరంభం కావలసింది. అప్పటి తెలంగాణా ప్రజల స్థితి దృష్ట్యా అటువంటి ఉద్యమం ఎంతో ఆవశ్యకమైనది కూడా. ఆంధ్రో ద్యమమంటే ముఖ్యంగా నిజాం రాష్ట్రంలోని తెలుగువారు 'మేము ఆంధ్రులం' అనే యధార్థాన్ని గుర్తించేట్టు చేయడం, వీరి మాతృభాష యైన తెలుగు వ్యాప్తికి కృషి చేయడం, వీరి రాజకీయ, ఆర్థిక సాంఘిక, సాంస్కృతిక అభ్యున్నతికి పాటుపడటం, వీరిలో ఆధునిక యుగ చైతన్యాన్ని కలిగించడం. ఇటువంటి పని జరగవలసిన ఆవశ్యకత ఆనాటి నిజాం నిరంకుశ ప్రభుత్వ హయాములో ఎంత గానో ఉండేది. ఈ రాష్ట్రంలో ఎనిమిది జిల్లాల ప్రాంతం తెలం గాణా. దీని వైశాల్యం 41,502 చదరపు మైళ్ళు. అప్పటి జనాభాను



మహాత్మాగాంధి హైదరాబాదు సందర్శించినప్పుడు తీసిన చిత్రం.
హనుమంతరావు పంతులుగారు కుడివైపు చివర ఉన్నారు.

బట్టి ఇక్కడ 60 లక్షల మందికి పైగా తెలుగువారు ఉండేవారు. కాని బ్రిటిషు ఇండియాలోని ఆంధ్రదేశస్థితితో పోల్చినా, లేక నిజాం రాష్ట్రంలోని మహారాష్ట్ర, కర్ణాటక జిల్లాలతో పోల్చినా తెలుగువారి పరిస్థితి శోచనీయంగా ఉండేది. ఎనిమిది జిల్లాలలో ఒకటి మాత్రమే ఇంగ్లీషు హైస్కూలు. ఇతర విద్యాసంస్థలు మహారాష్ట్ర, కర్ణాటక జిల్లాలకన్నా తక్కువగా ఉండేవి. ఈ స్థితి తెలంగాణా వాసుల విద్యా దారిద్ర్యాన్ని వెల్లడిస్తూ ఉండేది. ఉర్దూ ప్రభుత్వ అధికార భాష కావడం చేతనూ, ఉన్నత పాఠశాల విద్యకూడా అందులోనే బోధింప బడటం చేతనూ నిత్య జీవితంలో ఇక్కడి తెలుగువారు ఉర్దూ మాట్లా డటమే గౌరవంగా, ఫాషన్‌గా, నాగరికతగా భావించేవారు. ఇందు వల్ల వీరు మాతృభాషలో సరిగా మాట్లాడలేని స్థితి ఏర్పడింది. ఒక వేళ తెలుగు మాట్లాడినా సగం ఉర్దూ పదాలు ఉండేవి. అదొక రక మైన మిశ్రమ భాషగా ఉండేది. అత్యధికసంఖ్యాక ప్రజల భాషలైన తెలుగు, మరాఠీ, కన్నడం ఆనాటి నిజాం రాష్ట్రంలో రెండవ శ్రేణి భాషలై, వాటిని అభివృద్ధి పరిచే నాథుడు లేని అనాథలై ఉండేవి. మాతృభాషలో పత్రికలు చదివి దేశ పరిస్థితులు తెలుసుకోవాలన్న అభిలాష తక్కువగా ఉండేది. ఎక్కువగా ఉర్దూ పత్రికలు చదివే వారు. కొందరు ఇంగ్లీషు పత్రికలు చూచేవారు. ఆంధ్రుల చరిత్రకు పనికివచ్చే శాసనాలు ఇక్కడవున్నా వాటిపై దృష్టిని సారించినవారు లేరు. ఇక్కడి తెలుగువాడు హైదరాబాదు తన నగరమనీ, తెలుగు తన మాతృభాష అనీ సాధారణంగా భావించడు. అతని వేషభాషల్లో ఆంధ్రత్వం వెదకవలసి ఉండేది. నిరక్షరాస్యత హెచ్చుగా ఉండేది. సామాన్యప్రజ నిజాం నిరంకుశ ప్రభుత్వం క్రింద అభివృద్ధి అనేది ఎరుగక, మాతృభాషలో విద్యాసౌకర్యాలు లేక, సామాజిక రాజకీయ

స్థితిగతులను గూర్చిన స్పృహలేక అంధకారంలో పడిఉన్నారా అని పించేది. వీరి స్థితిని చూచి "అరువది లక్షల జీవులు నిజాం రాష్ట్ర మునకును, భారత వర్షమునకును చిరకాలము భారముగా నుండవలసిన దేనా ?" అనే ప్రశ్న తనకు తాను వేసుకొన్న తొలి హైదరాబాదు ఆంధ్రుడు మాడపాటి హనుమంతరావు పంతులుగారు. అంతేకాక "అన్ని విధములగు ఔన్నత్యము నలవడజేయ నత్యవసరమగు సంఘీ భావము, పూర్వ చరిత్రను గూర్చిన గౌరవము, భావి భాగ్యోదయ విష యమున విశ్వాసము తెలుగువారి హృదయ క్షేత్రములం దంకురింపనిచో మృతతుల్యులుగానున్న వీరి భావి సంతానము గతి యేమి గావలయును?" అనికూడా పంతులుగారు వాపోయారు. ఆనాటి హైదరాబాదు సంస్థా నంలో తెలుగువారి స్థితి చెప్పుకోదగినదిగా లేదు. రాజ్యాంగ విషయ కంగా తెలుగువారు ఉన్నతస్థితికి రాలేదు. ఒక్కరు మాత్రం అనుకో కుండా హైకోర్టు జడ్జీ పదవిలోకి వచ్చారు. ఉన్నతోద్యోగాలలో తెలుగువాళ్ళు లేనేలేరు. హైదరాబాదు శాసన నిర్మాణ సభలో ప్రముఖులైన ఆంధ్రులు సభ్యులుగా రాలేదు. ఆంధ్రులెవరూ సూబే దార్లు కాలేదు. అవ్వల్ తాలూకాదార్లు (జిల్లా కలెక్టర్లు) కాలేదు. హైకోర్టు ప్రముఖ న్యాయవాదులలో ఆంధ్రులు తక్కువ. పరిశ్రమలు ఆంధ్రు లవికావు. హైదారాబాదు నగరంలో తెలుగు మాట్లాడే వారి సంఖ్య అత్యధికంగా ఉన్నప్పటికీ నగర ప్రజా జీవితంలో వారికి స్థానంలేదు. తక్కువ సంఖ్యలో వున్న మహారాష్ట్రులు ప్రముఖంగా కన్పించేవారు. రాజధాని నగరమైన హైదరాబాదులో ప్రజాహిత కార్యాలపట్ల అభిరుచి, ఉత్సాహం కలవారు ఆనాడు ప్రధానంగా మహారాష్ట్రులే. ఉన్నత విద్యా విభూషితులు వారే. విద్యాసంస్థలను స్థాపించేవారు వారే. తెలుగు వారిలో సేవా తత్పరత, ఉత్సాహం, చొరవ గోచరించేవి కావు. 1918 లో స్థాపింపబడ్డ ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉర్దూ భాషను మాత్రమే

అభివృద్ధి పరుస్తూ ఇచటి ప్రాంతీయ భాషలైన తెలుగు, మరాఠీ, కన్నడ ములను పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూవుంటే పట్టించుకొన్న వారే లేరు.

పరిస్థితి ఇంత నిరాశాజనకంగా ఉన్నప్పటికీ తెలుగు భాషా వ్యాప్తికీ, తెలుగు ప్రజలను ప్రబోధించడానికీ గ్రంథాలయాలు చేయగల సేవ అమూల్యమైనదని హనుమకొండలో స్వానుభవం వల్ల తెలుసు కొన్న హనుమంతరావు పంతులుగారు మొదట గ్రంథాలయాల స్థాప నకూ, వాటి పెంపుకూ కృషి చేశారు. అయితే తెలుగువారి సర్వతో ముఖ అభ్యుదయానికై రావలసిన ఉద్యమమే రాలేదు. అందుకు కార ణాలున్నాయి. స్థితిమంతులైన వారిలో ప్రజాహిత జీవనంపై ఆసక్తి లేకపోవడం, ప్రజాసేవకు పూనుకొనేందుకు సుఖజీవనాన్ని త్యాగంచేసే నిరతి లేకపోవడం, ప్రభుత్వ ఆజ్ఞల మూలంగా ప్రజాహిత కార్య క్రమాలపై పలురకాల నిషేధాజ్ఞలు అమలులో వుండటం.

ఈ స్థితిలో ఒక చిన్న సంఘటన వల్ల ఆంధ్రోద్యమానికి ఇక్కడ అంకురార్పణ జరిగింది. 1921 నవంబరు 12 వ తేదీ రాత్రి హైదరాబాదు నగరంలో గౌలీగూడా ప్రాంతంలోని వివేకవర్ధనీ థియేటరులో హిందూ సంఘ సంస్కరణ మహాసభ జరుగుతూ వుంది. సభాస్థలి మహారాష్ట్ర వాతావరణం కలది. మహాసభను నిర్వహించిన ప్రముఖులు మహారాష్ట్రులే. మహాసభాధ్యక్షులు పూనా నివాసి, సంఘ సంస్కర్త, భారతదేశంలో మొట్టమొదటి మహిళా విశ్వవిద్యా లయ స్థాపకుడూ అయిన ధోండో కేశవ కర్వే పండితుడు. సభాసదు లలో పెక్కుమంది మహారాష్ట్రులే. ఆ రోజుల్లో ప్రజాహిత జీవ నంలో, విద్యారంగంలో ఈ నగరంలో వారిదే పైచేయికదా ! అయితే

ఆంధ్రులు, కన్నడులు కూడా సభా కార్యక్రమంలో పాల్గొన్నారు. కర్వే పండితుని ఉపన్యాసం కొంత మరాఠీలో, కొంత ఇంగ్లీషులో సాగింది. సభలో తీర్మానాలు, ఉపన్యాసాలు ఇంగ్లీషు, ఉర్దూ, మరాఠీ భాషలలో జరిగాయి. ఆంధ్రుల పక్షాన మాడపాటి హనుమంతరావు పంతులుగారు వేదికపై ఆసీనులై ఉన్నారు. సభలో తెలుగు, మరాఠీ, కన్నడ భాషలలో ప్రసంగాలు జరగవచ్చునని విషయ నిర్ణయ సభవారు అంతకుమునుపే ఆమోదించారు. హనుమంతరావుగారు తెలుగులో ప్రసంగించారు. ఒక తీర్మానంపై హైకోర్టు వకీలు ఆలంపల్లి వెంకట రామారావుగారు తెలుగులో ప్రసంగించబోగా సభలో ఉన్నవారు ముఖ్యంగా మహారాష్ట్రులు తెలుగు ప్రసంగం వినడం ఇష్టంలేక, ఉపన్యాసం సాగకుండా చప్పట్లు చరచి కేకలు వేయసాగారు. వెంకటరామారావుగారు తమ ఉపన్యాసాన్ని మధ్యలోనే ఆపివేయవలసి వచ్చింది. సభకు వచ్చిన ఆంధ్రులు ఈ అవమానం వెంకటరామారావు గారికే కాక ఆంధ్రభాషకు ఆంధ్ర జాతికి జరిగినట్లు భావించారు. హైదరాబాదు తెలంగాణాలో ఉన్న నగరం. నగర జనాభాలో తెలుగువారు అధిక సంఖ్యాకులు. అయినప్పటికీ ఒక వక్త తెలుగులో ఉపన్యాస మివ్వడానికి వీలులేకుండా చేశారు. సభలో ఉన్న ఆంధ్ర ప్రముఖులు మనఃక్లేశం పొంది సభ ముగియక మునుపే లేచి బైటికి వెళ్ళారు. ఇండ్లకు వెళ్ళ లేదు. ఆ రాత్రే హైకోర్టు న్యాయవాది టేకుమాల రంగారావుగారి ట్రూప్‌బజారు ఇంటిలో 12 మంది ఆంధ్ర ప్రముఖులు సమావేశమై భావి కర్తవ్యాన్ని గూర్చి చర్చించి 'ఆంధ్రజన సంఘము' స్థాపించారు. వారిలో మాడపాటి హనుమంతరావు, ఆదిరాజు వీరభద్రరావు, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు, టేకుమాల రంగారావు, బోయినపల్లి వెంకటరామ నరసింహారావు, మందుముల రామచంద్రరావు,

ాద్గుల నరసింగరావు, పందిటి రామస్వామినాయుడు, నడింపల్లి జానకి ామయ్య, మిట్టా లక్ష్మీనరసయ్య, కొమ్మవరపు సుబ్బారావు ప్రభృ ులు ఉన్నారు. అంటే 1921 నవంబరు 12వ తేదీన నిజాం రాష్ట్ర ంధ్రోద్యమం ఆరంభమైందన్నమాట. ఆంధ్రజన సంఘమునకు ధ్యక్షులు బారిష్టరు ఆర్. రాజగోపాలరెడ్డిగారు. కార్యదర్శి మాడపాటి ానుమంతరావు పంతులు. నిజాం రాష్ట్రాంధ్రులకు సేవచేసే అవకాశం ఈ రూపంగా లభించినందుకు పంతులుగారు లోలోపల సంతసించారు. ఈ ఆంధ్రజనసంఘం స్థాపనతో తెలుగు న్యాయవాదులు ప్రజాహిత వనంపట్ల ఆసక్తి చూపారు.

ఆంధ్రజనసంఘం స్థాపించింది మొదలు దాని పెంపు ారకై హనుమంతరావుగారు నిర్విరామంగా కృషి చేయసాగారు. ూడు నాలుగేళ్ళలోనే ఆంధ్రజనసంఘాలు 50 వరకూ వివిధ ప్రదే ాలలో స్థాపింపబడ్డవి. సుమారు 90 గ్రంథాలయాలు కూడా తెలం ాణాలో ఏర్పడి భాషాసేవ, విజ్ఞానవ్యాప్తి గావించడం మొదలు ెట్టాయి. ప్రజలలో సంచలనం కలిగింది. తెలంగాణాలో క్రమంగా ీకట్లు తొలగిపోతూ ఉషోరేఖలు కాంతులు వెదజల్లసాగాయి.

ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. వీరు తెలంగాణావారు దా. ఆంధ్రజన సంఘం, ఆంధ్రోద్యమం అని ఎందుకు వ్యవహ ించారు? తెలంగాణా జన సంఘమని ఎందుకు పేరు పెట్టలేదు ? ానికి జవాబేమిటంటే ఇక్కడి పెద్దలు తమ చరిత్రను సింహావలోకనం ేసుకొన్నారు. చరిత్రలో తెలుగు భాష మాట్లాడే ప్రజలను ఆంధ్రులు ాని పేర్కొనడం జరిగింది. ఆంధ్రదేశం త్రిలింగదేశం పర్యాయ ాదాలు. ఆంధ్రభాష, తెలుగుభాషా పర్యాయ పదాలు. ఉర్దూ భాషీ ములైన నిజాం అధికార్లు తెలుగును 'తెలంగీ' అనేవారు. 'తెలంగీ

బేఢంగీ' (తెలుగు భాషకు ఒక క్రమపద్ధతి లేదు) అని అపహసించే వారు. భాషను అర్థం చేసుకోలేక, నేర్చుకోవాలన్న ఉద్దేశమే లేక, మాట్లాడటం చేతకాక భాషను అలా ద్వేషభావంతో తూలనాడేవారు. కాబట్టి ఆంధ్రభాష అనే మాటే ఇక్కడ బాగా రూఢమైంది. పైగా తెలంగాణాలో తొలి దశలో స్థాపింపబడ్డ సంస్థల పేర్లలో ఆంధ్ర శబ్దమే కనిపిస్తుంది. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, రాజరాజ నరేంద్ర ఆంధ్ర భాషానిలయం, వేమన ఆంధ్ర భాషానిలయం, మొదలగునవి. కాబట్టి చరిత్రను బట్టి ఆంధ్రజన సంఘం, ఆంధ్రోద్యమం అని వ్యవహరించారు.

ఆంధ్ర జనసంఘం ఆదర్శాలలో నిజాం రాష్ట్రంలోని ఆంధ్రులలో పరస్పర సానుభూతి కలిగించి, వారి అభివృద్ధికై పాటుపడటం, ఆంధ్రులకొరకు సంఘాలు సంస్థలు స్థాపించడం, ఉపన్యాససభలు ఏర్పాటు చేయడం- అంటే ఆంధ్రులలో సంఘీభావం కలిగించడానికీ వారి మాతృభాషావ్యాప్తికీ తొలుత ప్రాధాన్యమిచ్చారన్నమాట. నిజాం రాష్ట్రంలో ప్రతి ఆంధ్రవ్యక్తి 18 సంవత్సరాలకు మించిన వయస్సు కలిగి చదవడం వ్రాయడం వస్తే ఆంధ్రజనసంఘంలో సభ్యుడు కావచ్చు.

రాష్ట్రంలో పలుతావుల ఆంధ్రజన సంఘాలు ఏర్పడ్డవి. వీటన్నిటికీ ఒక కేంద్రజనసంఘం అవసరమని భావించి 1923 ఏప్రిలులో హనుమకొండలో కేంద్రసంఘ నియమావళిని ఆమోదించారు. ఆంధ్రజన కేంద్రసంఘం మొదటి సమావేశం 1923 జులై 27 తేదీన హైదరాబాదులో మాడపాటి హనుమంతరావుగారి ఇంటిలో (ఆంధ్ర కుటీరము) జరిగింది. ఆ సంవత్సరానికి అధ్యక్షులుగా రావు బహద్దర్ సా. వెంకటరెడ్డిగారిని ఎన్నుకొన్నారు. కార్యదర్శి మాడపాటి హను

మంతరావుగారు. ఇక్కడినుండి హనుమంతరావు పంతులుగారే ఆంధ్ర జనసంఘం రథసారథి. ఆంధ్రజన కేంద్రసంఘం విధులలో గ్రంథాలయాలు పాఠశాలలు స్థాపించడం, విద్యార్థులకు సహాయం చేయడం, విద్వాంసులను సన్మానించడం, తాళపత్ర గ్రంథాలు శాసనాలుసంపాదించి పరిశోధన జరిపించడం, కరపత్రములు లఘుపుస్తకములద్వారా తెలుగు ప్రజలకు ముఖ్య సమస్యలనుగూర్చి సమాచారాన్ని అందించి విషయ పరిజ్ఞానం కలిగించడం, విజ్ఞానాన్ని వ్యాపింపజేయడం, ఆంధ్రభాషా ప్రచారానికై అవసరమైన ప్రయత్నాలన్నీ జరపడం వంటివి ఉన్నాయి. వీటానికి ఇవన్నీ సాంస్కృతికలక్ష్యాలే. మరి ఆంధ్రసంస్కృతి పునరుద్ధరణమేకదా వీరి తొలి ఆశయం. దానిని ఒక ఉద్యమంగా ప్రచలితం చేశారు. కేంద్రసంఘం వివిధ ఆంధ్రజన సంఘాలను పర్యవేక్షణ చేస్తూ వాటికి కార్యవిధానాన్ని సూచిస్తూ ఉండేది. ఈ పనిని పంతులుగారు ఒక్క చేతిమీదుగా నడిపేవారు.

ఇట్లా మత, జాతి, వర్గ, వృత్తి వివక్షత లేకుండా తెలుగు జన సామాన్యానికి సంబంధించిన ఉద్యమంగా ఆంధ్రోద్యమం ఆరంభింపబడింది. కొంతకాలం తర్వాత నిజాం రాష్ట్రాంధ్రదేశంలో స్థిర నివాసం కలిగి ఆంధ్రులమని చెప్పుకొనేవారు ఆంధ్రులుగా ఎంచబడ్డారు. మాతృభాష వేరైనవారూ ఈ సభలలో పాల్గొన్నారు. దీని వేదికలనుంచి తెలుగులోనే కాక ఇతర భాషలలోకూడా మాట్లాడే అవకాశ మిచ్చారు. అందుకు కొందరు అభ్యంతరం చెప్పి తెలుగులోనే విధిగా మాట్లాడవలెనని వాదించినప్పటికీ ఉద్యమ నాయకులు అలా సంకుచిత పరచడం ఉద్యమ వ్యాప్తికి ఏ విధంగానూ తోడ్పడదని భావించినవారై దీనికాక విశాలమైన ప్రాతిపదిక ఏర్పరిచారు.

ఆంధ్రజన కేంద్ర సంఘ సమావేశాలు వివిధ ప్రదేశాలలో జరిగేట్టు పంతులుగారు శ్రద్ధ వహించారు. అందువల్ల ఆయా ప్రదేశాల ప్రజలు తమ భాష, తమ సంస్కృతి పట్ల, తమ సమస్యల పట్ల శ్రద్ధా సక్తులు కనపరిచారు. రెండవ కేంద్రసంఘ సమావేశం 1924 లో నల్లగొండలో జరగగా, మూడవ సమావేశం 1925 లో మధిరలో జరిగింది. నాల్గవ సమావేశం 1928 లో సూర్యాపేటలో జరిగింది. మధిర, సూర్యాపేట సమావేశాలలో ప్రథమ, ద్వితీయ గ్రంథాలయ సభలు కూడా జరిపించారు. ప్రజలలో పెల్లుబుకుతూ వున్న ఉత్సాహాన్ని అదుపులో ఉంచి దానిని నిర్మాణ మార్గంలోకి మరల్చడానికి పంతులుగారు పూనుకున్నారు.

పంతులుగారు ఆంధ్రోద్యమం నడపడంతోపాటుగా యాదవ, ముదిరాజ, మున్నూరుకాపు, పద్మశాలి, గౌడ, విశ్వబ్రాహ్మణ, నాయీ బ్రాహ్మణ, ఆదిహిందూ వర్గీయులను కూడా మేల్కొలిపారు. ఆ వర్గాలవారు చైతన్యవంతులై ఆంధ్రోద్యమంలో వారివంతు కృషి సల్ప డానికి ఉత్సాహంతో ముందుకు వచ్చారు. పంతులుగారు వారికిచ్చిన ప్రోత్సాహం, సహకారం ఆశీస్సులు బలవర్ధక ఔషధంవలె పని చేశాయి. కొద్ది కాలంలోనే వారి సంఘాలు చురుకుగా పనిచేయ సాగాయి. ఇట్లా కుల సంఘాలకు ప్రోత్సాహ మివ్వడంలో పంతులు గారు నిర్దిష్టమైన ప్రయోజనాన్ని శ్రేయస్సును కాంక్షించారు. వారి ముఖ్యోద్దేశం ఏ కులానికి, ఏ వర్గానికి చెందిన ప్రజలలోనైనా మొదట జాగృతి కలుగడం అవసరం. తమ సమాజం పైకి రావలెననే కోర్కె వారిలో కలగాలి. సంఘీభావంతో పనిచేసే మనఃస్థితి వారికి ఏర్ప డాలి. వ్యక్తి శ్రేయస్సు కాక, వర్గ శ్రేయస్సు, సమాజ శ్రేయస్సు అనే దృక్పథం వారికి ఏర్పడాలి. దీనివల్ల స్వార్థం వెనక్కి పోతుంది.

ఆయా కులాల అభివృద్ధికై పాటుపడేటువంటి సంఘాలు, సభలు భాష ఒకటే కాబట్టి ఆంధ్రోద్యమాన్ని శక్తివంతం చేస్తాయి. అనేక చిన్న నదులు ఒక పెద్ద నదిలో వచ్చి కలిసి దానిని మహా ప్రవాహంగా చేసినట్లే, కుల వర్గ సంఘాలన్నీ ఆంధ్రోద్యమానికి పుష్టిని చేకూర్చాలి. ఇది జరిగితే, ఆంధ్ర మహాజనులు త్వరితగతిని అభ్యుదయం సాధింపగలుగుతారు. ముఖ్యంగా దిగువ కులాలకు చేయూత నిచ్చి పైకి తేవడం అవసరం. ఆంధ్ర సమాజంలో ఏ ఒక్క కులం సాంస్కృతికంగా వెనుకబడి ఉన్నా అది ఆంధ్రోద్యమానికి ఆరోగ్యప్రదం కాదు, ఇది పంతులుగారి కార్య విధానానికి ఆధారమైన దృక్పథం. పైగా ఆ కాలంలో వివిధ కులాలు వర్గాల మధ్య ద్వేషం, వైరభావం లేవు. కులతత్వ ప్రాతిపదికపై వైషమ్యాలు లేవు. ఎవరికి వారు వారి సమాజం పైకి రావాలనే ఉద్దేశంతో సంఘం స్థాపించుకొని పని చేసుకుపోయేవారు. అన్య కులాలవారు సహకారమిస్తే తీసుకొనేవారు. చిత్తశుద్ధితో తమ సంఘీయులను విద్యా విషయకంగా, సాంఘికంగా పురోగమింప జేయడమే వారి లక్ష్యం. వారిలో ఎవరు పంతులుగారి వద్దకు వచ్చినా పంతులుగారిలో తమ మాతృభాషయైన ఆంధ్రము యొక్క నాయకుని, తమ సంస్కృతి సంప్రదాయాలను పరిరక్షిస్తూ వున్న ఒక మహాపురుషుని చూడగలిగేవారు. ఇది ఆనాటి తెలంగాణా పరిస్థితి. ఇది పంతులుగారికెంతో ఆనందం, ఆవేగం కలుగజేసేది. ఆంధ్రభాష మాట్లాడే వారంతా ఒకే సమాజమన్న భావం వారిలో క్రమేణా కలుగుతూ రావడం పంతులుగారు గమనించారు. ఇది శుభసూచకం, ఆహ్వానింప దగ్గ విశేషం అన్న సంతృప్తి వారికి కలిగింది. అట్లా అన్ని సంఘాలు పుష్టిని పొందితే ఆంధ్ర జాతి పరిపూర్ణమైన తేజంతో విరాజిల్లుతుంది. పంతులుగారు అనుసరించిన ఈ విధానం వివేకంతో కూడుకొన్నదని, దీనివల్ల ఆంధ్రోద్యమ

విస్తరణలో సత్ఫలితాలు కనిపించాయనీ ఉద్యమ గమనాన్నిబట్టీ మనం గ్రహింప గలుగుతాము. ఆంధ్రజన సంఘం క్రియాకలాపం వల్ల కలిగిన ఒక సత్ఫలితమేమిటంటే – ఒకప్పుడు ఉర్దూ భాషలో మాట్లాడటమే నాగరికతగా భావించిన పట్టణాల విద్యార్థికులు క్రమంగా తెలుగులో ఉపన్యాసా లివ్వసాగారు. పామరులుకూడా తెలుగు ఉపన్యాసాలు వినసాగారు. తరచు సభలు సమావేశాలు అన్నిచోట్లా జరుగుతున్నాయి. తెలుగు పత్రికలు పట్టణాలలోనే కాక గ్రామసీమలలోకూడా కన్పిస్తున్నాయి. పోస్టువాళ్ళు బందగుర్తులు పెట్టుకొని వాటిని అందజేస్తున్నారు. రచయితలు కవులు పుట్టుకొచ్చి పత్రికలకు తెలుగులో కవితలు కథలు వ్యాసాలు వ్రాయసాగారు.

ఆంధ్రజన కేంద్రసంఘం సందేశం, దాని ఆశయాలు తెలంగాణా మారుమూలలకు కూడా తెలియరావాలికదా. ఇందుకు ప్రచారం జరగాలి. కనుక కేంద్రసంఘం పక్షాన పంతులుగారు ఉన్నవ వెంకటరామయ్య గారనే సమర్థుడైన ప్రచారకుని నియమించారు. ఈ ప్రచార కార్యానికై ఆంధ్రేతరులైన దేశభక్త వామన్ నాయక్‌గారు 1930 కి పూర్వమే రూ. 300 విరాళమిచ్చారంటే పంతులుగారు ఆంధ్రోద్యమానికి ఆంధ్రేతరుల సద్భావాన్ని ఎంత మేరకు పొందగలిగారో, ఈ ఉద్యమానికి ఎంత గట్టి పునాది వేశారో విశదమవుతుంది. ఆంధ్రజన సంఘం ఆంధ్రేతరులపై తాత్కాలికమైన ఆగ్రహం వల్ల ఆవిర్భవించి నప్పటికీ, దాని పెంపు పోషణలను ఉదాత్త రీతిలో జరుగునట్లు చేసి, ఆంధ్రేతర సోదరులు ఈ ఉద్యమంపట్ల సుహృద్భావంతో వ్యవహరించేట్టు చేయగలిగిన బుద్ధి కుశలత, ప్రజ్ఞ, దక్షత పంతులుగారివే అని చెప్పవలసి ఉన్నది. ఒక భాష మాట్లాడే వారి దార్ఢ్యత, శక్తిసామర్థ్యాలు వారి సంఘటిత స్వభావంలో, ఇతరులపట్ల

వారు కనపరిచే సౌజన్యంలో, తమను తాము నిర్మాణాత్మకంగా ప్రవర్ధనం చేసుకొని ఇతరులకు తాము అందుకొన్న అభ్యుదయాన్ని ఆదర్శంగా కనపరచడంలో ప్రతిబింబిస్తాయని పంతులుగారి విశ్వాసం.

ప్రజలకు భోగట్టా అందజేసి వారికి సంగతి సందర్భాలు తెలియజేసే నిమిత్తమై కేంద్రసంఘం పక్షాన లఘు పుస్తక ప్రచురణకు పంతులుగారు ఏర్పాట్లు చేశారు. వర్తక స్వాతంత్ర్యము, వెట్టిచాకిరీ, గ్రంథాలయాలు, మన వాక్స్వాతంత్ర్యము, మద్యపానము, ఋణభార నివారణ వంటి చిన్న పుస్తకాలు అట్టి ప్రచురణలలో కొన్ని.

ఆంధ్రోద్యమ వ్యాప్తిని గమనించిన పంతులుగారు ఆంధ్రజన సంఘం కార్యకలాపాల పరిధిని పెంచడం అవసరమని భావించారు. అరవై లక్షలకు మించిన నిజాం రాష్ట్రాంధ్రుల సమస్యలను తెలిసికోవడానికీ, వారి సమిష్టి అభిప్రాయాన్ని నిర్మించడానికీ ఒక మహాసభ అవసరమని ప్రముఖులు, విద్యాధికులు అభిప్రాయం వ్యక్తం చేశారు. పంతులుగారు ఇందుకు తగు ప్రాతిపదికను సిద్ధంచేయగా 1930 మార్చి 3వ తేదీన మెదక్ జిల్లాలోని జోగిపేటలో మొట్టమొదటి ఆంధ్రమహాసభ సమావేశం జరిగింది. ఈ సభకు అతికష్టంమీద పంతులుగారు నిజాం ప్రభుత్వ అనుమతిని సంపాదింపగలిగారు. ప్రభుత్వం ఈ దిగువ షరతులు విధించి అనుమతి ఇచ్చింది. సభాధ్యక్షుడు పరదేశీయుడు కాకూడదు. అంటే గైర్ ముల్కీ కారాదు. నిజాం రాష్ట్రవాసులు ముల్కీలు. నిజాం రాష్ట్రానికి చెందనివారు గైర్ ముల్కీలు. నిజాం ప్రభుత్వం ఇటువంటి విభజన ఒకదానిని అమలులోకి తెచ్చింది. కాబట్టి నిజాం ఆంధ్రమహాసభ అధ్యక్షుడు హైదరాబాదు రాష్ట్రవాసియై ఉండాలి. ఇతర మతస్థులకు మనస్తాపంకాని, అనుమానంకాని కలిగే స్థితి తేరాదు. సభలో రాజకీయాల ప్రసక్తి ఉండకూడదు. అంటే రాజకీయాలు

చర్చింపరాదు. ఈ ప్రథమాంధ్ర మహాసభకు విఖ్యాత సాహిత్యవేత్త, రచయిత, గోలకొండ పత్రిక సంపాదకులు అయిన సురవరం ప్రతాప రెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఈ ప్రథమ మహాసభ 'ఆంధ్రదేశపు మట్టి అది మాకు కనకము' అనే గేయంతో ఆరంభం కావడం గమనార్హమైన విశేషం. హైదరాబాదు సంస్థానంలో నివసించే తెలుగువారిలో 'మేము ఆంధ్రులము. ఆంధ్రుల చరిత్ర సంస్కృతి నాగరికత మాకు గర్వకారణమైనవి' అనే భావాన్ని ఏదో ఒకవిధంగా కలుగజేయడమే ఆంధ్రోద్యమం మొదటిదశలో ముఖ్య దృక్పథంగా ఉండేది. దీనికి పంతులుగారు బహుజాగ్రత్తగా, సర్వజన సమ్మతమైన రీతిలో కార్య రూప మిచ్చారు. పంతులుగారి దృష్టిలో ఆంధ్రమహాసభ తెలంగాణా ప్రజల జాతీయోద్యమం. భారత ప్రజలకు ఇండియన్ నేషనల్ కాంగ్రెసు ఎటువంటిదో తెలంగాణావారికి ఆంధ్రమహాసభ అటువంటిదని వారికి అంతర్గతంగా ఒకభావం ఉండేది. నిజాం రాష్ట్రాంధ్రులు సంకల్పించుకొన్న ఆంధ్రమహాసభకు 1885 లో బొంబాయిలో ఉమేశ్ చంద్ర బెనర్జీ అధ్యక్షతన 70 మంది ప్రతినిధులతో 1,000 మంది ప్రేక్షకులతో సమావేశమైన దేశీయ మహాసభ (అనగా భారత జాతీయ కాంగ్రెసు) మొదటి సమావేశాన్నే పంతులుగారు ఒక ఒరవడిగా పెట్టు కొన్నారు. తెలంగాణాకు ఆంధ్రోద్యమము ఒక జాతీయోద్యమం అయింది.

మహబూబునగర్‌జిల్లా షాద్‌నగర్‌లో జరుగవలసిన రెండవ ఆంధ్ర మహాసభకు జిల్లా తాలూక్దారు అనుమతి ఇవ్వక, విషయం ప్రభుత్వానికి నివేదించాడు. అప్పటి పోలీసుశాఖ మంత్రి టి. జె. టాస్కర్ ఆంధ్ర జన కేంద్రసంఘం కార్యదర్శి అయిన హనుమంతరావు పంతులుగారిని తమవద్దకు పిలిపించుకొని దాదాపు రెండుగంటలసేపు సంభాషణ జరిపి, యాభై ప్రశ్నలడిగి అనుమతి ఇస్తామని వాగ్దానం చేస్తూ "మీ ఉద్యమంలో

ఈ రాష్ట్రమునకు మేలు చేయదగిన యోగ్యతలు చాలా కలవు. అయి నను ముందెన్నడైన ఇది అపాయకరమైనదిగా పరిణమించగలదు" అన్నారట. అందుకు పంతులుగారు "అటువంటి పరిణామం కలుగ జేయము" అని హామీ ఇచ్చారు. ఆంగ్లేయుడు కాబట్టి ఉద్యమం యోగ్య తలు కలదని అంగీకరించాడు. అదే ఏ జంగ్‌గారో అయితే ఆయన గారికి అన్నీ దోషాలే కనిపించేవి. ఆ కాలంలో నిజాం ప్రభుత్వ మంత్రివర్గంలో రెవిన్యూ పోలీసు శాఖలను ముందు జాగ్రత్తగా ఆంగ్లేయ మంత్రికి అప్పగించడం ఆనవాయితీగా ఉండేది. పోలీసు మంత్రి పంతులుగారిని పిలువనంపిన లేఖలో పొరపాటున ఉదయం 9 గంటలకు కలుసుకోవలసిందని వ్రాశాడు. పంతులుగారు అలాగే ఉదయమే వెళ్ళారు. కాని ఆయన లేకపోవడంచేత ఇంటికి తిరిగి వచ్చారు. ఇంటికి తిరిగి వచ్చేసరికి మంత్రిగారి కారు వుంది. వారి నౌకరు ఉత్తరంతో సహా హాజరుగా ఉన్నాడు. ఆ కారులో వీరిని వెంటనే రావచ్చునని, లేదా సాయంకాలం రావలసిందని లేఖలో తెలిపారు. పంతులుగారు కారును పంపించివేసి సాయంకాలం వెళ్ళి టాస్కర్‌ను కలిశారు. ఆంగ్లేయుడైనా ఆయన కర్తవ్య నిర్వహణ చాతుర్యం, తన తప్పిదాన్ని ఒప్పుకొనే ఉదారమైన న్యాయబుద్ధి, సౌజన్యం పంతులుగారిని ఆకర్షిం చాయి. ఈ మంత్రి ఆంధ్రోద్యమం ఎడల సద్భావం కలవాడై సహాయ మొనర్చినాడని కూడా పంతులుగారు అంగీకరించి వున్నారు.

తర్వాత మూడవ ఆంధ్రమహాసభ మహబూబునగర్ జిల్లా కొల్లాపురంలో జరుపుకోవడానికి నిజాం మంత్రిమండలి సమేతులైన ప్రధానమంత్రి మహారాజా సర్ కిషాన్ పర్షాద్ బహదూర్‌వారు అనుమతి నిరాకరించగా, పంతులుగారు ఆంధ్రోద్యమం రాజకీయమైనది కాదనీ, ఇది తెలంగాణావాసుల సారస్వత నైతిక సాంఘికాభివృద్ధికొరకు మాత్రమే

ఉద్దేశింపబడినదనీ, తెలంగాణాలో మరెక్కడైనా సభ జరుపుకోవడానికి అనుమతి ఇవ్వమనీ విజ్ఞప్తులు పంపారు తుదకు అనుమతి ఇస్తూ రాజకీయ, విద్యా విషయాలను గూర్చి ప్రభుత్వంయొక్క పాలసీనిగాని ఆజ్ఞలనుగాని చర్చించుట విమర్శించుట కూడదంటూ, ప్రభుత్వం విధించిన ఈ షరతును మహాసభ నిర్వాహకులు అతిక్రమించకుండా వుండేటందుకై పంతులుగారిని రెండువేల రూపాయల నగదు జమానతు ఇవ్వమని కోరారు. అందుకు ప్రభుత్వంవారు చెప్పినట్లుగానే సభ జరుపుతామనీ, జమానతు షరతును తొలగించి అనుమతి ఇవ్వవలసిందనీ కోరుతూ కేంద్రసంఘంచే తీర్మానం చేయించి పంతులుగారు దానిని ప్రభుత్వానికి పంపారు. చివరకు పోలీసుశాఖ మంత్రి కేంద్రసంఘం వారికి దర్శన మిస్తామంటే పంతులుగారు, బూర్గుల రామకృష్ణారావుగారు వెళ్ళి ఆయనను చూచారు. వాదోపవాదాలు జరిగాయి. అంతకు పూర్వం జరిగిన రెండవమహాసభలో చేయబడ్డ తీర్మానాలపై ఆక్షేపణలు లేవదీశారు. తర్వాత ఎప్పుడో మహాసభకు అనుమతి ఇచ్చారు.

ఇట్లా ప్రభుత్వంవారు కల్పింపదలచిన అడ్డంకులను పంతులుగారు అధిగమిస్తూ, వారి ఉద్దేశమేమిటో పసిగట్టుతూ ఉండేవారు. ఆటంకాలకు నిరుత్సాహపడక, పట్టుదలతో కార్యార్థియై కృషిచేసేవారు. ఒకవేళ పంతులుగారికి ప్రభుత్వం విధించిన షరతులు హీనాతిహీనములని తోచినా, ఆ కాలంలో తెలంగాణా కార్యకర్తలు ఎట్టి షరతులకైనా తలఒగ్గి, మహాసభలు జరుపుకోవడమే మంచిదికాని, కోపంతో లేదా నిరాశతో సభలు మానుకోవడం లాభప్రదంకాదని భావిస్తూ ఉండేవారు. పంతులుగారు వారితో ఏకీభవించి 'అనువుగానిచోట అధికులమనరాదు' అన్న సూక్తిని జ్ఞప్తికి తెచ్చుకొని, గోపాలకృష్ణ గోఖలే చెప్పిన 'అది అపజయాల కాలం' అన్నమాట గుర్తుకు తెచ్చుకొని ఆంధ్రోద్యమం

సజీవంగా ఉండటానికై సర్దుకు పోయేవారు. ఓపిక, తాలిమి, సహన భావం ఆంధ్రోద్యమానికి జయం చేకూర్చాయని పంతులుగారి నమ్మిక.

1931 లో రెండవ ఆంధ్రమహాసభ నల్లగొండ జిల్లా దేవరకొండలో బూర్గుల రామకృష్ణారావుగారి అధ్యక్షతన జరిగింది. మూడవ మహాసభ 1934లో ఖమ్మంలో పులిజాల వెంకటరంగారావుగారి అధ్యక్షతన జరిగింది. కరీంనగర్‌జిల్లా సిరిసిల్లలో 1935 లో జరిగిన చతుర్థ ఆంధ్ర మహాసభకు మాడపాటి హనుమంతరావు పంతులుగారే అధ్యక్షులు. 1936 లో మహబూబునగర్‌జిల్లా షాద్‌నగర్‌లో జరిగిన అయిదవ మహాసభకు కొండా వెంకటరంగారెడ్డిగారు అధ్యక్షులు. 1937 లో జరిగిన నిజామాబాదు మహాసభకు మందుముల నరసింగరావుగారు అధ్యక్షులు. 1940 లో మల్కాపురంలో జరిగిన మహాసభకు మందుముల రామచంద్రరావుగారు అధ్యక్షులు. 1941 లో చిలుకూరులో జరిగిన మహాసభకు రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షులు. 1942 లో ధర్మవరంలో జరిగిన మహాసభకు మాదిరాజు రామకోటీశ్వరరావుగారు అధ్యక్షులు. 1943 లో హైదరాబాదులో జరిగిన మహాసభకు కొండా వెంకట రంగారెడ్డిగారు అధ్యక్షులు. వీరితో పోటీచేసిన కమ్యూనిస్టు నాయకుడు బద్దం యల్లారెడ్డిగారు ఓడిపోయారు. 1944 లో భువనగిరిలో జరిగిన మహాసభకు రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షత వహించారు. ఈ భువనగిరి మహాసభను గూర్చి హనుమంతరావు పంతులుగారు వారు రచించిన 'తెలంగాణా ఆంధ్రోద్యమము' అనే చరిత్రలో "మే 1943 నుండి మే 1944 వరకు గడచిన కాలము తెలంగాణా ఆంధ్రోద్యమ చరిత్రలో చాల క్లిష్టమును, మనస్తాపమును కలిగించునట్టిదియు అయినదని విచారముతో ఒప్పుకొనవలసి యున్నది. ఈ నడుమ కార్యకర్తలలో కలిగిన తీవ్రములగు అభిప్రాయ భేదములకును, ఒక పక్షము వారి అత్యంత ఉద్ధృతము

నకును పరిణామముగా భువనగిరిలో జరిగిన ఆంధ్రమహాసభ కేవలము ఏక పక్షీయమైనదిగా తేలినది" అని వ్రాశారు. దీనితో ఆంధ్రమహాసభ రెండుగా చీలిపోయింది. ఒకటి జాతీయ ఆంధ్ర మహాసభ. రెండవది కమ్యూనిస్టుల ఆంధ్రమహాసభ. జాతీయవాదులు భువనగిరి మహాసభను బహిష్కరించి 1945 లో మడికొండలో మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన పన్నెండవ మహాసభ జరుపుకొన్నారు. హనుమంతరావు పంతులుగారు జాతీయ మహాసభ పక్షాన నిలిచారు. కమ్యూనిస్టులు వారి మహాసభను ఖమ్మంలో రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిపారు. పదమూడవ ఆంధ్రమహాసభ 1946లో మెదక్ జిల్లా కందిలో సర్దార్ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతన జరిగింది. కంది మహాసభ తర్వాత ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర పరిషత్తు, కర్ణాటక పరిషత్తులతోసహా స్టేట్ కాంగ్రెసులో విలీనమైంది. మెదకుజిల్లా జోగిపేటతో మొదలైన ఆంధ్ర మహాసభ అదే మెదకుజిల్లా కంది మహాసభతో ముగిసి, జాతీయ సంస్థతో కలిసిపోయింది. ఇది గుర్తుపెట్టుకోవలసిన అంశం.

ప్రతి ఆంధ్రమహాసభతోపాటు మహిళాసభకూడా విడిగా జరిగే పద్ధతిని పంతులుగారు ప్రవేశపెట్టారు. ఆంధ్ర మహిళాసభలకు అధ్యక్షత వహించిన విదుషీమణుల వివరాలు ఇవి :

| | | | |
|---|---|---|---|
| 1930 | జోగిపేట | ... | నడింపల్లి సుందరమ్మ |
| 1931 | దేవరకొండ | ... | టి. వరలక్ష్మమ్మ |
| 1934 | ఖమ్మం | ... | యల్లాప్రగడ సీతాకుమారి |
| 1935 | సిరిసిల్ల | ... | మాడపాటి మాణిక్యమ్మ |
| 1936 | షాద్‌నగరు | ... | బూర్గుల అనంతలక్ష్మీదేవి |
| 1937 | నిజామాబాదు | ... | నందగిరి ఇందిరాదేవి |
| 1940 | మల్కాపురం | ... | యోగ్య శీలాదేవి |

1941 చిలుకూరు ... రంగమ్మ ఓబులరెడ్డి
1942 ధర్మవరం ... రంగమ్మ ఓబులరెడ్డి
1943 హైదరాబాదు .. యల్లాప్రగడ సీతాకుమారి

మహిళల సభలు ఎవరి జోక్యం లేకుండా స్వతంత్రంగా జరిగే ఆచారాన్నికూడా పంతులుగారు ప్రవేశపెట్టారు. ఈ మహిళా మహా సభలకు ఒరవడి అఖిలభారత మహిళా మహాసభ. ఈ సభలు సంఘ సంస్కరణోద్దేశాలను బలపరచి, స్త్రీ జనోద్ధరణకోసం కృషిచేసి, స్త్రీలలో ఎంతో చైతన్యాన్ని వికాసాన్ని కలుగ జేశాయి. ఎన్నడూ ఇల్లువదలి బహిరంగ సభలకురాని మహిళలు సైతం ఈ మహిళాసభలకు ఉత్సాహంగా వచ్చేవారు. భారత దేశమంతటా స్త్రీల హక్కుల విష యంలో, వారి శ్రేయోభివృద్ధుల విషయంలో ద్యోతకమైన భావాలనే, ఆ దృక్పథాన్నే ఆంధ్ర మహాసభయొక్క మహిళా మహాసభలు సాధ్య మైనంతవరకూ సమర్థించి అనుసరించడం గమనించవలసిన విశేషం. భారతదేశంలో సర్వత్రా వ్యక్తమైన ప్రగతిశీల భావాలను సంస్కరణలను వీరు బలపరిచారు. వితంతు వివాహాలను సమర్థించారు. బహుభార్యా త్వాన్నీ కన్యాశుల్కాన్నీ వేశ్యావృత్తినీ నిషేధించవలసిందిగా కోరారు. తల్లిదండ్రుల ఆస్తిలో కుమార్తెలకు భాగం ఉండవలెనన్నారు. శాసన సభలలో స్త్రీలకు ప్రాతినిధ్యం ఉండవలెనని ఉద్ఘోషించారు. స్త్రీల సభ లకు పంతులుగారిచ్చిన ప్రోత్సాహం, వాటికి కల్పించిన స్వేచ్ఛాపూరిత వాతావరణం స్మరింపదగినది. ఎంతపెద్ద వ్యక్తి అయినా సరే, మహిళా సభలలో జరిగే చర్చలనుగూర్చి జోక్యం కలుగజేసుకోకుండా దృఢంగా నిలిచి, అవాంఛనీయ సంఘటనలు జరుగకుండా చూచారు. ఖమ్మంలో ఆంధ్ర మహిళా మహాసభ యల్లాప్రగడ సీతాకుమారిగారి అధ్యక్షతన జరుగుతూవుంది. అసలు ఆంధ్రమహా సభలంటేనే హిందువులలో

సనాతనులైనవారికి మింగుడుపడని వ్యవహారంగా ఉండేది. ఇక మహిళా సభలంటే స్త్రీల విషయమై ఎటువంటి చర్చలు జరుగుతాయో, ఏ సంస్కరణలు కోరుతూ తీర్మానాలు ఆమోదింపబడుతాయోనని పూర్వాచార పరాయణులు ఆందోళన చెందేవారు. కనుక ఖమ్మం స్త్రీల మహా సభకు ఆటంకాలు కల్పించారు. సనాతనులు జిల్లా అవ్వల్ తాలూక్దారును వెంట బెట్టుకొని సభజరిగే స్థలానికి వచ్చారు. అక్కడే వెలుపల నిల్చొనిఉన్న ఆంధ్రజన కేంద్రసంఘ కార్యదర్శియైన మాడపాటి హనుమంతరావుగారి వద్దకు తాలూక్దారు వచ్చి సనాతన ధర్మావలంబులైనవారికి మనస్తాపం కలిగే ఉపన్యాసాలు తీర్మానాలు జరగకుండా చేయవలసిందని కోరాడు. దానిపై పంతులుగారు "ఇది స్త్రీల సభ. నేను ఆ సభలోకి పోజాలను" అని వారికి మర్యాదగా చెప్పారు. అందుకు తాలూక్దారు "మీరువెళ్ళి అధ్యక్షురాలిని హెచ్చరించండి" అని అన్నాడు. అంతవరకూ సహనంతో ఉన్న పంతులుగారు "నేను ఆ సభలోకి ప్రవేశింపజాలను. నన్ను తమరు అరెస్టుచేసి తగినచర్య గైకొనవచ్చు" అని ఖండితంగా చెప్పారు. ఆ మీదట వారంతా వచ్చినదారినే తిరిగి వెళ్ళిపోయారు. కొంతదూరంవెళ్ళిన తర్వాత అవ్వల్ తాలూక్దారు ఆ పక్షాలతో "ఇకమీదట ఇటువంటి అవకతవక ఫిర్యాదులు చేయవద్దు" అని వారిని మందలించి వెళ్ళిపోయాడు. మహిళా మహాసభ నిరాటంకంగా జరిగి పోయింది. ఆంధ్ర మహా సభలకు ఒక వంక నిరంకుశ నిజాం ప్రభుత్వం చిత్తంవచ్చినట్లు ప్రతిబంధకాలు కల్పిస్తూఉంటే, వేరొకవంక సనాతనులైన హిందువులు హిందూ ధర్మాన్ని పరిరక్షిస్తున్నామంటూ అధికార్లను ఆశ్రయించి ఆటంకాలు కల్పించ యత్నించేవారు. అసలు ఖమ్మంలో ఆంధ్ర మహాసభ జరగకుండా నిషేధించవలెనని వారు పై అధికారులకు విన్నవించుకున్నారు. ఆంధ్రమహాసభలకు ఏదోఒక విధంగా అడ్డు తగల చూచే ప్రభుత్వానికి సనాతనుల విన్నపం ఊతగా దొరికింది. కాని మహా

సభల నాయకులు ఈ రెండు ప్రతిపక్షస్థులనూ ఎదుర్కొని ఖమ్మం మహా సభ జరిపారు. సనాతనులతో గొడవ ఎందుకని కొన్ని తీర్మానాలను ఖమ్మం సభలో సభానిర్వాహకులు ఉపసంహరించుకున్నారు. సనాతనులు అభ్యంతరంచెప్పిన ఒక తీర్మానం ఇట్లా ఉన్నది. "పవిత్రములగు దేవాలయములందు ప్రాణిహింసా పూర్వకమగు నారాధన జరుపుటను ఈ మహా సభ గర్హించుచు. సాత్విక పూజా విధానమును మాత్రమే ఆచరణలో నుంచవలెనని కోరుచున్నది." జంతు బలిని ఖండించే తీర్మానమిది. దీనికి సనాతనుల ఆక్షేపణ! సనాతనులకు నిరంకుశ ప్రభుత్వ ప్రాపకం!! అట్లాగే అతిబాల్య వివాహాలను ఆపి, వివాహ వయస్సును హెచ్చించి కన్యాశుల్క వరశుల్కాలను నిర్మూలించి, వివాహ వ్యయాన్ని తగ్గించాలనే తీర్మానం, నిమ్నజాతుల ఉద్ధరణకు సంబంధించిన తీర్మానం కూడా ఆంధ్రమహాసభ నాయకులు వదులుకొని రాజీపడవలసి వచ్చిందట.*

ఆంధ్రోద్యమం మొదలైననాటినుంచి 15 సంవత్సరాలవరకూ ఇది రాజకీయోద్యమ మనిపించుకోలేదు. ఇన్నేండ్లూ ఉద్యమ నిర్వాహకులు తమది రాజకీయోద్యమం కానేకాదని ప్రకటించుకొంటూ ప్రభుత్వానికి నచ్చజెప్పుతూ పని సాగించుకొంటూ వచ్చారు. కాని నిజామాబాదులో మందుముల నరసింగరావుగారి అధ్యక్షతన జరిగిన ఆరవ ఆంధ్రమహాసభలో అప్పటి నిజాం ప్రభుత్వం రాజ్యాంగ సంస్కరణలను సూచించడానికై ఏర్పాటుచేసిన అయ్యంగార్ కమిటీని బాధ్యతాయుత ప్రభుత్వంయొక్క తత్వంపై ఆధారపడ్డ రాజ్యాంగ సంస్కరణలను సిఫారసు చేయవలసిందని కోరడంతో ఇది రాజకీయోద్యమ

---

* '50 సంవత్సరాల హైదరాబాదు'–
రచయిత : మందుముల నరసింగరావు

స్వరూపం దాల్చింది. ఆ తర్వాత నిజాం ప్రభువు ప్రకటించిన సంస్కరణలు అతిహీనములు, అభివృద్ధి నిరోధకములు కావడంతో జన సామాన్యంలో ఆంధ్రమహాసభ ప్రబోధం హెచ్చింది. అయితే పంతులుగారు ఆంధ్రోద్యమం రాజకీయోద్యమం కాదని నిజాం ప్రభుత్వ అధికారులకు చెబుతూ వచ్చారుకదా. రాజకీయ సంస్థగా మారినప్పుడు దీనితో సంబంధం వదులుకోగలమని అప్పుడు మంత్రిగా ఉన్న ఆంగ్లేయునికి వాగ్దానం చేశారుకదా! ఆ వాగ్దానాన్ని వీరు పాటించి ఆ సంస్థతో సంబంధం వదులుకొంటున్నట్లు అప్పటి ఇంగ్లీషు మంత్రులకు తెలియజేశారని అభిజ్ఞులు అన్నారు.

తెలంగాణా ఆంధ్రోద్యమానికి ప్రజాభిమానం లభించడానికి ఉద్యమం దినదినాభివృద్ధి పొందడానికి ముఖ్యకారణం ఆంధ్ర మహాసభ ప్రజాజీవితంలో అన్ని వర్గాలవారికి సంబంధించిన ఆర్థిక సాంఘిక సమస్యలను చేపట్టి, వాటిని గూర్చి తీర్మానాలు ఆమోదించి, ఆ తీర్మానాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి ప్రజా సమస్యలను పరిష్కరించేందుకు నిరంతరకృషి జరపడమే. ఆంధ్ర మహాసభ కర్షకులు, కౌలుదార్లు, కార్మికులు, వర్తకులు మున్నగువారి సమస్యలను శ్రద్ధగా పరిశీలిస్తూ ఉండేది. గ్రామస్థుల ఋణభారం, నీటిపారుదల విధానం, అబ్కారీ విధానం, అటవీశాఖ విధానం, గ్రామాలలో విద్యాప్రచారం, గ్రామీణుల ఆరోగ్యం, జాగీరు ప్రజల కష్టనష్టాలు, జనసామాన్యవిద్య, మాతృభాష ద్వారా విద్యాబోధన, ఉన్నతవిద్యకు ప్రభుత్వం పరిమితి విధించకుండా దానిని వ్యాప్తం చేసేందుకు కృషి, మద్యపాన నిరోధంవంటి అనేక సమస్యలపై ఆంధ్రమహాసభ తీర్మానాలు ఆమోదించి ఆందోళనజరిపింది. హనుమంతరావు పంతులుగారు, ఇతర నాయకులు గ్రామాలకు వెళ్ళి గ్రామస్థుల కష్టాలు అవసరాలు తెలుసుకొని, వాటి నివారణకై ఏమి చేయవలసిందీ స్థానికులతో చర్చలు జరిపేవారు. ఆ సామాంశంతో

ఆంధ్రమహాసభ స్థాయీసంఘం పక్షాన ప్రభుత్వశాఖలకు లేఖలు పంపి, ఆ వ్యవహారాలను ఉన్నతాధికార్లు పరిష్కరించేట్టు చూచేవారు. ముఖ్యంగా వర్తకుల సమస్యలను పరిష్కరించడంలో పూర్తిగాను, వెట్టిచాకిరీ నిర్మూలనలో కొంతవరకూ ఆంధ్రమహాసభ విజయం సాధించింది.

నిజాం రాష్ట్రంలో ప్రభుత్వోద్యోగులు జిల్లాల పర్యటనకు వచ్చినప్పుడు వర్తకులు వారి భోజనానికి కావలసిన సామగ్రిని సప్లయి చేయవలసి వచ్చేది. ఆ సామగ్రికి డబ్బు అసలే చెల్లింపకపోవడమో, ఒకవేళ చెల్లించినా ఏ కొద్దిగానో చెల్లించడం జరిగేది. ఈ దోపిడీవల్ల వర్తకులు నష్టపోతూ ఉండేవారు. ఈ బాధను తప్పించుకోవడానికై గ్రామ వర్తకులు 'వంతు పద్ధతి'ని కూడా ఏర్పరచుకొన్నారు. కొందరు ఒకసారి, మరికొందరు ఇంకొకసారి సామగ్రి సప్లయిచేసేవారు. అంటే దండుగను పంచుకొనేవారన్నమాట. ఆంధ్రోద్యమం ఆరంభమైన కొద్దిరోజులకే వర్తకసంఘాలు స్థాపింపబడ్డవి. ఆంధ్రజన కేంద్రసంఘం పక్షాన 'వర్తకస్వాతంత్ర్యము' అనే చిన్న పుస్తకం కూడా ప్రకటింపబడింది. ఈ వర్తకసంఘాలు పర్యటనలకొచ్చే అధికార్లు తమకు కలిగిస్తూ ఉన్న బాధలను, నష్టాన్ని ప్రభుత్వదృష్టికి తీసుకురావడం మొదలుపెట్టారు. ఆ తర్వాత ఈ జబర్దస్తీ తగ్గుముఖం పట్టింది. "మా గ్రామంలో వర్తకసంఘం స్థాపించబడింది" అని ఒక్కమాట చెబితేచాలు, ప్రభుత్వోద్యోగులు నిరుత్తరులై పోయేవారట. క్రమేణా వర్తకుల కష్టాలు తొలగిపొయ్యాయి. కొన్నేండ్ల తర్వాత హనుమంతరావు పంతులుగారు నల్లగొండ జిల్లాలో ఒక చిన్న గ్రామంలోనుంచి వెళ్ళుతూ ఉన్నారు. అక్కడ కనపడ్డ వైశ్య సోదరులతో మాట్లాడి వారి యోగక్షేమాలు విచారించుతూవున్న సందర్భంలో వారు "అయ్యా, మా గ్రామాలలోని వైశ్యుల కష్టాలన్నీ ఇరవైయేండ్ల క్రిందనే తొలగిపోయాయి. వాటిని

తొలగించిన ఉపకారం ఆంధ్రసంఘం వారిది" అని ఎంతో సంతోషంతో చెప్పుకొని పంతులుగారికి తమ కృతజ్ఞతలు తెలిపారు. అయితే అట్టి నిశ్చింతవల్ల వర్తకసంఘాలు పూర్తిగా మూలపడినందుకు పంతులుగారు ఆ తర్వాత విచారం వెలిబుచ్చారు. సాంఘికంగా వారు చేయవలసింది ఎంతోవుంది అని వారన్నారు.

అట్లాగే వెట్టిచాకిరి నిర్మూలనానికికూడా ఆంధ్ర మహా సభ కృషి సల్పింది. ఆ రోజులలో ప్రభుత్వాధికార్లు వారి పరివారంతో సేవకులతో జిల్లాల పర్యటనకు వెళ్ళినపుడు కొన్ని రోజులు క్యాంపువేసేవారు. అప్పుడు కుమ్మరి నీళ్ళుతేవాలి, వంటచేయాలి. చాకలి పాత్రలు కడగాలి, బట్టలు ఉతకాలి, హరిజనులు అధికార్ల మూటాముల్లెలు ఒక గ్రామంనుంచి మరొక గ్రామానికి మోసుకుపోవాలి చేయించుకొన్న ఈ పనులకు కూలీ ఇచ్చేవారుకాదు. ప్రతి ఆంధ్ర మహా సభలోనూ ఈ వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ప్రబోధం జరిగింది. తీర్మానాలుచేసి ప్రభుత్వానికి పంపారు. అయితే ప్రభుత్వ ఫ్యూడల్ వైఖరివల్ల వర్తకుల కష్టాలు నివారణ అయినట్లుగా వెట్టిచాకిరీ చేసేవారి అవస్థలు తొలగిపోనందుకు హనుమంతరావు పంతులుగారు అసంతృప్తి వెల్లడించారు. చివరకు వెట్టిచాకిరీ అనేది కాంగ్రెసు ఆధ్వర్యాన ప్రజా ప్రభుత్వం ఏర్పాటైన తర్వాతనే పూర్తిగా తొలగిపోయింది.

తెలంగాణా ఆంధ్రోద్యమంలో సంఘ సంస్కారోద్యమం ఒక భాగంగా సాగింది. సహపంక్తి భోజనాలు, అస్పృశ్యతా నివారణ, స్త్రీ విద్య, వితంతు వివాహాలు, రజస్వలానంతర వివాహాలు, కుల ప్రసక్తి లేకుండా, భాషాపత్తిధులనుబట్టి ఉద్యమాన్ని నడపడం, వీటన్నింటివల్ల ఇక్కడి ప్రజానీకంలో ఆంధ్రోద్యమ కాలం నుంచే సంఘ సంస్కరణ దృక్పథం వేళ్ళూనింది. హనుమంతరావు పంతులుగారు

వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమంచే ప్రభావితులై ఆంధ్రోద్యమంలో సంఘసంస్కరణకు కూడా ప్రాముఖ్యమిచ్చి ఉద్యమాన్ని నడపడంవల్లనే ఇది సాధ్యమైంది. ఇట్లా పంతులుగారు ఏకకాలంలో పలు ఉద్యమాలను ప్రవర్తింపజేయవలసి వచ్చింది. కొత్తగా బాటవేసేవారు డొంకలనూ దుబ్బులనూ తొలగించి మార్గాన్ని సాఫు చేయవలసి వుంటుంది కదా !

ఆంధ్రోద్యమ ప్రచారము, ఆందోళన పూర్తిగా రాజకీయమైనవి కావు. నిజాం ప్రభుత్వానికి కూడా ఈ ఉద్యమం కాంగ్రెసు ఉద్యమం వంటిది కాదని తెలుసు. అయితే అది ప్రజలలో ప్రబోధం కలిగిస్తూ ఉంది. వారిని నిద్రనుంచి మేల్కొల్పుతూ వుంది. ఎనిమిది పెద్ద జిల్లాల భాషఅయిన తెలుగు వ్యాప్తిజెందుతూ వుంది. పైగా పేరే ఆంధ్ర మహాసభ. వీరి ప్రచార కార్యక్రమమంతా తెలుగులోనే జరుగుతూవుంది. గ్రామీణుల మేలుకొరకై ప్రభుత్వంవారి ఆజ్ఞల అన్వయం తాత్పర్యం ప్రజలకు విడమరచి చెప్పబడుతూ వుంది. శాసనాలనూ నియమ నిబంధనలనూ విజ్ఞులైనవారు న్యాయవాదులు పరిశీలించి వాటి అసలు విషయాలను ప్రజలకు తెలియజెప్పి, వాటిని ఎట్లా ఎదుర్కోవాలో తెలియజెప్పబడుతూ వుంది. ప్రజలకు క్రమేణా వారి హక్కులు తెలియవస్తున్నాయి. వీటన్నిటినీ చూడగా ఈ ఉద్యమం ముందు ముందు ఎట్లా వుంటుందోనని నిజాం ప్రభుత్వాధికార్లకు అనుమానం కలుగుతూ ఉండేది. జిల్లా అధికార్లు ప్రభుత్వానికి రహస్యంగా రిపోర్టులు పంపేవారు. పోలీసులు కార్యకర్తలను వెన్నంటి తిరుగుతూ ఉండేవారు. అయితే పంతులుగారు, ఇతర నాయకులు పెట్టనికోటవలె ఉండి, ఆంధ్ర మహాసభ చట్టబద్ధమైన సంస్థగా, బాధ్యత ఎరిగిన సంస్థగా పనిచేయడం

వల్ల కార్యకర్తలు ప్రజలు అధికార్లకు భయపడనక్కర లేకపోయింది. పైగా పంతులుగారు ఆంధ్రమహాసభ చేస్తూవున్న కృషి నిర్మాణాత్మక మైనదని ఎప్పటికప్పుడు రుజువుచేస్తూ ఉండేవారు. ఆంధ్ర మహాసభల సందర్భంలో ప్రభుత్వశాఖలతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి సభాస్థలి వద్ద ఆ శాఖల ప్రదర్శనములు ఏర్పాటు చేయించేవారు. వారిచే ఉప న్యాసాలు ఇప్పించేవారు. మతపసక్తిని వ్రాతలలోగాని ప్రసంగాలలో కాని రానిచ్చేవారుకాదు. ఇట్లా ఒక కట్టుబాటు క్రమశిక్షణతో నడపబట్టే ప్రథమ ఆంధ్రమహాసభకు నిజాం మంత్రిమండలి కార్యదర్శి నవాబ్ మెహదీ నవాజ్ జంగ్ ఒక సందేశం పంపుతూ, "ఆంధ్రమహాసభ అనగా తెలుగుదేశమందలి గ్రామ వాస్తవ్యులగు వ్యవసాయకులయొక్క మహా సభ అని చెప్పవచ్చును." అన్నారు. ఈయన ఆ తర్వాత రాష్ట్రంలో ఏర్పడ్డ కాంగ్రెసు మంత్రివర్గంలో మంత్రిగా పనిచేశారు. ప్రభుత్వ వర్గాలలో ఏదైనా అనుమానం పొడసూపితే పంతులుగారు వెంటనే వారికి తగు సమాధానం చెప్పి ఆంధ్రోద్యమ నౌకను పదిలంగా సురక్షితంగా ముందుకు నడిపిస్తూ ఉండేవారు. ఉర్దూపత్రికలుకూడా ఇది మత పాక్షి కోద్యమం కాదని అంగీకరించాయి.

అన్నిటికన్న చెప్పుకోవలసిన ముఖ్యాంశ మేమిటంటే— ఆంధ్రో ద్యమం తెలుగుభాషకు జరిగిన ఒక అవమానంవల్ల ఆరంభమైంది. కాని పోనుపోను అది మహారాష్ట్ర, కన్నడ సోదరుల సద్భావాన్నీ సహకా రాన్నీ పొందగలిగింది. ఆంధ్రమహాసభ పనిచేస్తున్న తీరును చూచి మహారాష్ట్రులు, కన్నడులు వారివారి మహాసభలు ఏర్పాటు చేసుకొన్నారు. 1937 లో కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతీయసభలు మొదటిసారిగా జరి గాయి. 1946 లో ఈ మూడు ప్రాంతీయ మహాసభలు చక్కని సుహృ ద్భావంతో స్టేట్ కాంగ్రెసులో విలీనమయ్యాయి. తర్వాత స్టేట్ కాంగ్రెసులో

వచ్చిన విభేదాలు దృక్పథాలకూ, ఆదర్శాలకూ, సిద్ధాంతాలకూ సంబంధించినవేగాని, భాషా విషయకమైనవికావు.

హనుమంతరావు పంతులుగారి మితవాదధోరణి ఆంధ్రోద్యమం పట్ల ఆనాటి కొందరు అధికారుల వైఖరిని ప్రభావితం చేయడం గమనించవలసిన అంశం. హైదరాబాదు రాజ్యానికి రెవిన్యూ పోలీసుశాఖల మంత్రిగా పనిచేసిన టి. జె. టాస్కర్ ఐ. సి. యస్. మహాశయుడు ఇక్కడ మంత్రిపదవిని విరమించుకొని వేరొక పదవిపై దేరాడూన్ వెళ్ళిన తర్వాత పంతులుగారికి వ్రాసిన స్వకీయలేఖలో "మీతోను, మీ ద్వారా ఆంధ్రుల అవసరములతోను, వారి వాంఛలతోను పరిచితుడనగుట నాకు సంతోషము చేకూర్చి యుండినది. నా అనుభవాన్నిబట్టి మితవాదిత్వమే తుదకు జయముపొంది తీరును" అని వ్రాశాడు.

ఇట్లా మితవాద వైఖరితో నడపబడినప్పటికీ ఆంధ్రోద్యమాన్ని గూర్చి అప్పటి నిజాం ప్రభుత్వానికీ, వారి ఉన్నతాధికార్లకూ ఒక సందేహం పట్టి పీడిస్తూ ఉండేది. ఈ తెలంగాణా వారు భాష పేరుతో దేశీయులలో మాతృభాషాభిమానాన్ని పూరిస్తూ ఉద్యమం నడుపుతున్నారు. మరి అవతల మద్రాసు రాష్ట్రంలో కూడా కొన్ని తెలుగు జిల్లాలున్నాయి. తెలంగాణావారూ, మద్రాసు ఆంధ్ర ప్రాంతంవారూ, భాష ఒకటే కాబట్టి ఏకమైపోతే నిజాం రాష్ట్రం సంగతి ఏమికాను ? ఈ సంశయం వారిలో, ముఖ్యంగా మేధావులైన వారిలో ఉండేది. ఒకమారు మాడపాటి హనుమంతరావు గారితో అప్పటి నిజాం ప్రభుత్వ ప్రచురణల శాఖాధ్యక్షుడైన నవాబ్ అలీయావర్‌జంగ్ (ఈయన నిజాం ప్రభుత్వంలో అనేక ఉన్నత పదవులలో ఉన్నాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడుగా కూడా పనిచేశాడు. జవహరలాలు నెహ్రూ గారి దృష్టిలో పడి రాయబారిగా, గవర్నర్‌గా కూడా పని

చేశాడు) గారు "మీ ఆంధ్రోద్యమం యొక్క ఉద్దేశం ఈ రాజ్యంలో వున్న ఆంధ్ర జిల్లాలను మద్రాసు ప్రాంతంలోని ఆంధ్ర జిల్లాలతో కలిపివేయ వలెనని ఉన్నట్లు ప్రభుత్వం వారికి తెలియవచ్చింది" అని అన్నారట. అందుకు పంతులుగారు "ఇది మా ఆంధ్రోద్యమం యొక్క ఆశయం కానేరదు. తాము ఈ విషయమున యధార్థము పరిశీలింపక తప్పు అభిప్రాయపడుతున్నారు" అని వెంటనే ఖండించారు. అంటే నిజాంరాష్ట్రం మూడు భాషా ప్రాంతాల కృత్రిమ కలయిక అని నిజాం ప్రభుత్వపు మేధావి వర్గం ఆ రోజులలోనే తెలుసుకొన్నదన్న మాట. చిత్రమేమిటంటే నిజాం వర్గీయులు భయపడినట్లే, పంతులుగారు కాదని అన్నప్పటికీ, చివరకు జరిగింది !

ఆంధ్రమహాసభ విస్తృతమైన ప్రజా వ్యవహారాలలో నిమగ్నమై, భాషా సాహిత్యాలపై దృష్టిని కేంద్రీకరింప లేకపోవడం గమనించిన విద్యావంతులైన యువకులు కొందరు ఆంధ్రభాషా సంస్కృతుల ప్రచారం ప్రధాన లక్ష్యంగా ఒక సాహిత్య సంస్థను స్థాపింప సంకల్పించారు. 1942 లో ధర్మవరంలో జరిగిన నవమాంధ్ర మహాసభ సందర్భంలోనే కొందరు కవులు రచయితలు ఈ ప్రస్తావన తెచ్చారు. 1943లో హైదరాబాదులో దశమాంధ్ర మహాసభ జరిగినప్పుడు భాస్కర భట్ల కృష్ణారావు, బూర్గుల రంగనాథరావు సమావేశ కర్తలుగా 1943 మే 26 తేదీన రెడ్డి హాస్టలు గ్రంథాలయంలో లోకనంది శంకరనారా యణరావు గారి అధ్యక్షతన ఒక సమావేశం జరిగింది. అందులో నిజాం రాష్ట్ర ఆంధ్ర సారస్వత పరిషత్తు అనే పేరుతో ఒక సంస్థను స్థాపించారు. హనుమంతరావు పంతులుగారు ఈ సంస్థకు మొదటి కోశాధిపతి. దీని అభివృద్ధికి వారు ఎంతగానో తోడ్పడ్డారు. తర్వాత 'నిజాం' పదమును తొలగించడం జరిగింది. ఈ సంస్థను దేవులపల్లి రామానుజ

రావు, పులిజాల హనుమంతరావు, గడియారం రామకృష్ణశర్మ ప్రభృతులు చాలా అభివృద్ధిలోకి తెచ్చారు. ఈ సంస్థ తెలంగాణాలో ఆంధ్ర భాషాభివృద్ధికీ, సాహిత్య వికాసానికీ కృషి చేసింది.

తెలంగాణాలో అనేక ఉద్యమాలతో కూడిన ఆంధ్రోద్యమాన్ని నిర్మించి, దానిని విజయవంతంగా నడిపి, సమగ్రాంధ్రం ఏర్పడటానికి దారి డొంకలు సరిచేసి రాచబాట ఏర్పరచినవారు మాడపాటి హనుమంత రావుగారు. కాబట్టే రావి నారాయణ రెడ్డిగారు వారు రచించిన 'వీర తెలంగాణా — నా అనుభవాలు జ్ఞాపకాలు' అనే స్వీయచరిత్ర వంటి గ్రంథంలో పంతులుగారిపై వారికి గల సద్భావాన్ని వెల్లడిస్తూ "తెలంగాణాలో ఆంధ్రోద్యమానికి పునాదులు వేసిన గౌరవం పంతులుగారికే దక్కుతుంది. తెలంగాణాలో తెలుగు భాషకు ఒక గౌరవ స్థానం కలిగించి, తెలుగువారికి తెలుగు భాషను నేర్పిన ఘనత కూడా వారికే దక్కుతుంది. నాబోటి యువకులెందరో ఆయనవల్ల ప్రభావితులై ఆంధ్ర వాఙ్మయంతో పరిచయ మేర్పరచుకొన్నారు. .. నిజానికి చూస్తే అటు తర్వాత ఆంధ్రుల చిరస్వప్నం ఫలించి ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ అవతరణకు పంతులుగారి నిర్విరామ కృషిని స్మరించి తీరాలి" అని వ్రాశారు.

# నాల్గవ ఆంధ్రమహాసభ అధ్యక్షపదవి

హనుమంతరావుగారు నిజాంరాష్ట్ర ఆంధ్రమహాసభను స్థాపించి, దాని వ్యవస్థను నిర్మించినవారిలో ముఖ్యులైనప్పటికీ దాని అధ్యక్షపదవికి మొదట్లో దూరంగా ఉన్నారు. ఇందుకు కారణం ప్రజా సంస్థలలో పదవులపై వారికి వ్యామోహంలేదు. ఆ సంస్థల కార్యభారాన్ని వహించడంలోనే వారు శ్రద్ధాసక్తులు చూపేవారు. పదవుల ప్రసక్తి వచ్చే సరికి విద్యార్థికులను ముందుంచి తాము తప్పుకొంటూ ఉండేవారు. కాని నాల్గవ ఆంధ్రమహాసభ 1935 లో జరగబోయేసరికి ఆహ్వాన సంఘంవారూ, ఇతర సంఘాలవారూ, ప్రముఖులూ అంతా ఏకవాక్యంగా కరీంనగర్ జిల్లా సిరిసిల్లలో జరిగే ఈ చతుర్థ నిజాం రాష్ట్రాంధ్ర మహాసభకు మాడపాటి హనుమంతరావుగారే అధ్యక్షులుగా ఉండవలెనని పట్టుపట్టారు.

పంతులుగారిని హైదరాబాదునుంచి సిరిసిల్లకు తీసుకువెళ్ళిన దృశ్యం ఆంధ్రమహాసభ చరిత్రలో చిరస్మరణీయమైనది. 1935 మార్చి 26వ తేదీ ఉదయమే సిరిసిల్లి మహాసభకు వెళ్ళేవారు హైదరాబాదులో పంతులుగారి నివాసమైన "ఆంధ్ర కుటీరము"నకు చేరుకొని జయజయ ధ్వానాలు చేయసాగారు. మందుముల రామచంద్రరావుగారు పూలహారాలతో, మామిడి తోరణాలతో అలంకరించిన మోటారుకారును తీసుకు వచ్చి నిలిపి తామే స్వయంగా కారు నడిపారు. అధ్యక్షులవారి కారు కదలగానే వారివెంట 18 బస్సులలో 3 కార్లలో ప్రతినిధులు బయలు దేరారు.

సిరిసిల్లకు వెళ్లే మార్గంలో తూపురాను, కామారెడ్డి, మాచారెడ్డి, గోరెంటాల, గొల్లపల్లి గ్రామాలలో ప్రజలు అధ్యక్షులవారికి స్వాగత

మిచ్చి అందరికీ అల్పాహార విందుచేసి ఆదరించారు. సాయంసమయానికి అధ్యక్షులు సపరివారంగా సిరిసిల్ల చేరగానే ఆహ్వానసంఘంవారు స్వాగతంచెప్పి పెద్ద ఊరేగింపుతో మహాసభకొరకై నిర్మింపబడ్డ 'భీమ కవి నగరము'నకు తీసుకొని వెళ్ళారు. ప్రసిద్ధ ఆంధ్రమహాకవి వేముల వాడ భీమకవి కరీంనగరు జిల్లాకు చెందినవాడవడంచేత ఆయనపేరిట మహాసభ వేదిక నిర్మింపబడటం ఒకవిశేషం. అధ్యక్షుల మోటారుకారు ప్రధాన ద్వారంవద్దకు రాగానే స్వచ్ఛంద సేవకులు గౌరవవందనంచేశారు. కరతాళధ్వనులమధ్య అధ్యక్షులు మండపంలోకి ప్రవేశించారు.

ఆహ్వానసంఘాధ్యక్షులు ఆవునూరి వేణుగోపాలరావుగారు అధ్యక్షులకు ప్రతినిధులకు స్వాగతం చెబుతూ "ఇప్పుడు మనమొకనాయకుని ఏర్పరచుకోవలసి వున్నది. ఇందుకు మన ఆంధ్రోద్యమవ్యాప్తికి కారకులైన మహారాజశ్రీ మాడపాటి హనుమంతరావు హైకోర్టు వకీలుగారు అన్ని విధములా అర్హులని ఆహ్వానసంఘం అభిప్రాయపడింది వీరిని ఆంధ్ర ప్రపంచానికి పరిచయం చేయడం దీపం వెలుతురుతో నిండు చంద్రుని చూపినట్లగునని తలచుచు, ఈ మహాసభకు అధ్యక్షత వహించి కార్యక్రమాన్ని ఆదర్శప్రాయంగా జరిపెదరుగాక అని శ్రీవారిని కోరు తున్నాను" అన్నారు. ఈ ప్రతిపాదనను బూర్గుల రామకృష్ణారావు, మాదిరాజు రామకోటీశ్వరరావు, కొండా వెంకటరంగారెడ్డి, బి. కేశవరావు, బోయినేపల్లి వెంకటరామనరసింహారావుగారలు బలపరచగా, మాడపాటి హనుమంతరావు పంతులుగారు చతుర్థ ఆంధ్రమహాసభ అధ్యక్ష పీఠ మలంకరించి మువ్పావుగంటసేపు అధ్యక్షోపన్యాసం చేశారు.

పంతులుగారు తమ అధ్యక్షోపన్యాసంలో శ్రీనాథమహాకవి రచించిన పల్నాటి వీరచరిత్రములోని—

